# సతీసర్దరాం

గ్రంథకర్త:

కె. యస్. నారాయణరావు.

పబ్లిషర్:

పెదమల్లు బంగారయ్యా,

బుక్ సెల్లర్, రాజమండ్రి.

కాకినాడ:

స్కేప్ అండ్ కో., ముద్రాశాలలో

కె. సుబ్బారాయసోదరులచే ముద్రింపఁబడియె.

రిజష్టర్డు కాపీరైట్] 1926. [వెల 0-12-0.

| నాటకములు. | |
|---|---|
| ప్రతిజ్ఞ వెల | 0-12 |
| ాత్రృదాస్యవిమోచనము | 0-12 |
| త్తరరామచరిత్రము | 0-12 |
| ృష్ణలీల | 0-12 |
| సపుత్రవిజయము | 0-12 |
| ాదుకాపట్టాభిషేకము | 0-12 |
| ంకాదహనము | 0-8 |
| యంతజయపాలము | 0-3 |
| ాంతామతి | 0-12 |
| ామదాసునాటకము | 1-0 |
| ఆలీబాబా | 1-0 |
| శ్రీరామజననము | 0-12 |
| శ్రీరామోద్యోగము | 0-12 |
| శ్రీరామవిజయము | 0 12 |
| శ్రీరామప్రవాసము | 0-12 |
| శ్రీరామఅశ్వమేధము | 0-12 |
| తపతీసంవరణము | 0-12 |
| సీతాకళ్యాణము | 0-12 |
| రుక్మిణీకళ్యాణము | 0-12 |
| శ్రీనివాసకళ్యాణము | 0-12 |
| సువర్ణపాత్రి | 1-0 |
| చతురచంద్రహాస | 0-12 |
| లాలుగోపాలు | 0-12 |
| శతకంఠరామాయణము | 1-0 |
| శ్రీమదామనోహరము | 0-12 |
| విచిత్రచిత్రమాల | 0-12 |
| ండవజననము | 0-12 |

| నాటకములు. | |
|---|---|
| పాండవప్రవాసము | 0- |
| పాండవోద్యోగము | 0-1 |
| పాండవవిజయము | 0-1 |
| పాండవాశ్వమేధము | 0- |
| పీష్వానారాయణరావువధ | 0- |
| సారంగధరనాటకము | 0- |
| సంపూర్ణోత్తరరామాయణము | 1 |
| సంపూర్ణ రామాయణము | 1 |
| సంపూర్ణభారతము | 1 |
| ద్రౌపదీవస్త్రాపహరణము | 1 |
| పద్మవ్యూహము | 1 |
| శ్రీకృష్ణరాయభారము | |
| స్త్రీసాహసము | 0 |
| సత్యహరిశ్చంద్ర | 0 |
| సావిత్రి | 0 |
| మాలతీమధుకరము | |
| కనకతార | |
| వరవిక్రయము | |
| శారదావిజయము | 0 |

| పద్యకావ్యములు. | |
|---|---|
| శివానందలహరి | |
| శ్రీజగన్నాథమహాత్మ్యము | |
| వ్యభిచారసాగరము | |
| శ్రీభగవద్గీత | |
| బిల్హ యము | |
| శృంగారనైషధము | |

శ్రీ

# సతీసద్ధర్మః

గ్రంథకర్త.

కొడాలి సత్యనారాయణరావు.

పబ్లిషర్సు

పెదమల్లు బంగార

బుక్కుసెల్లరు రాజమండ్రి.



మొదటికూర్పు 2000.

స్కేప్ అండు కో లో., కె. సుబ్బారాయడుసోదరులచే

ముద్రింపంబడినది.

                [వెల రు 0—12—0

# — ఉపోద్ఘాతము —

మానవదృష్టిని ప్రస్తుతము నాటకములుగాక సినీమాలాకర్షించినవి. చిత్రవిచిత్రగాథలనిర్మించి ప్రజాబాహుళ్యమునకు సంతోషమొదఁగూర్చుటలో సినిసినీమాలవారు ప్రసిద్ధిఁగాంచిరి. నేనీనడుమ నేలాపురిలోఁ బ్రదర్శింపఁబడిన "సతీసర్దర్బా" కథను జూచినప్పటినుండియు నియ్యదిరంగస్థలంబునఁ బ్రదర్శింప యోగ్యమై నీతిదాయకము గనున్నటులఁదోఁచి యాయితివృత్తమునుగైకొని దృశ్యప్రబంధముగ రచించితి. ఈనాటక మాంధ్రలోకమున కెంతవఱకుపయోగపడునో నిర్ణయించుభారము పాఠకమహాశయులపైనున్నదని విన్నవించుకొనుచు నింతటితో విరమించెద.

ఇట్లు విధేయుఁడు,

మకాం కొవ్వూరు
ది 27-8-26

కొడాలి సత్యనారాయణరావు.
— గ్రంథకర్త —



## — కృతిసమర్పణ —

ఓపరమేశ్వరీ!

మా మనీకు సాయ ♦ మేమిచేయఁగ లేద

టంచు నేల వాగ్వి ♦ హించెదమ్మ.

చిత్తశాంతికొఱకుఁ ♦ జేసెదనీకృతి.

నర్పణంబు నీకు ♦ నందుకొమ్మ!

# ఈనాటకమునందు వచ్చుపాత్రలు.

## పురుషులు.

1 మానసింహుఁడు.
2 విశ్వనాథశాస్త్రి.
3 విక్రమసింహుఁడు.
4 రహిమత్ఖాను.
5 వజీరల్లీఖాను.
6 కేకిమహారాజు.
7 భటుఁడు.
8 రాజసింహుఁడు.
9 భగవాన్దాసు.
10 వీరసింహుఁడు.
11 రణజిత్సింహుఁడు.

## స్త్రీలు.

1 తార.
2 రూపవతి.
3 సర్దర్బా.
4 చంద్రావతి.

గ్రంథకర్తయనుమతి లేనిది యీనాటకమెవ్వరును ప్రదర్శింపరాదు. ప్రదర్శించిన గ్రంథకర్తచర్యలకుఁ బాత్రులు.

—శ్రీరామచంద్ర—

# సతీసద్ధర్బా.

—నాంది—

చ॥ పితరులు నైదులోఁబడి త ♦ పించుచునుండఁగ, నన్నదుష్టుఁడై
మతివనుసోదరిన్ తురక ♦ కర్పణఁ జేయఁదలంచ భక్తభా
వితచరణుండు శ్రీహరిల ♦ భించెను రక్షకవీరసింహుఁడై
సతికినతండె మాకును ను ♦ సంగుత నిత్యమభీష్టసిద్ధులన్॥

శా॥ పాతివ్రత్యమహాత్మ్య భాస్కరకర ♦ ప్రారబ్ధమోతుల్ యశ
శ్రీతస్వీప్రియగేహరాజములు; రా ♦ శీభూతశోభాస్పద
వ్రాతల్ శీలసుగంధబంధురలు కా ♦ రా భారతీపద్మినుల్
మాతల్లుల్ సకలార్యదేశజన స ♦ న్మానార్హలై పార్వతీ
ప్రీతిప్రాభవలై నిరంతరము ధా ♦ త్రిన్ బొందుతన్ సౌఖ్యముల్॥



శ్రీరామచంద్ర.

# సతీసర్వస్వ·

## — ప్రథమాంకము —

ప్రవేశము:—విశ్వనాథుఁడును, మానసింహుడును.—

మాన—(గ్లాసునిండుగ సారాయమును పోసికొని త్రాగును)

విశ్వ—అదీపట్టు.—పట్టంటే అట్లావుండాలి.-

మాన—మఱలఁద్రాగనా?

విశ్వ—ఊఁ.

మాన—(మఱలఁద్రాగును. ఇప్పుడు బాగున్నదోయి:-

విశ్వ—నేనుచెప్పలేదూ? దానిలోనున్న మహత్తు దేనియం దునులేదు. ముఖ్యముగా దీనిని రాజులు నేర్చుకొని తీఱవలయును?

మాన—ఎందుచేత?

విశ్వ—రాజులెప్పుడును యుద్ధమునకు సంసిద్ధులైయుండవలయును. దానికుత్సాహ మధికముగానుండవలెను. అందుచేతనే ప్రతిరాజును మధుసేవాతత్పరుఁడై యుండవలెను:-

మాన—అందునకేమైన నితరలక్షణములుండవలయునా?

విశ్వ—కాకుల పిన్నియున్నవి. కళాశాస్త్రము నభ్యసింపవల యును. దాని నభ్యసింపుటకుముందుఁ గొంకెక్కటమును నేర్వవల యును.-

మాన—రణమునకును కామశాస్త్రమునకును గల సంబంధ బాంధవ్యములెట్టివి?

విశ్వ—అటులడుగుము చెప్పెదను. రణమునకు నృత్తగీతవా ద్యము లవసరమగుటచేత:-

మాన—మనము వీటిని నేర్చుకొనుటకొకరిని నియమించవలెను గదా?-

విశ్వ—ఆరమునకు నేర్పదా?

మాన—అది యిచటకువచ్చునా?

విశ్వ—మనమే అచ్చటకుఁబోవచ్చును.

మాన—నాయనగారికి తెలిసినఁ బ్రమాదమువచ్చును?

విశ్వ—నిన్ను తిరహస్యముగఁ దీసికొనిపోవువాఁడను నేను. మఱి లనింటికడ జాగ్రత్తగ దిగఁబెట్టువాఁడనునేను. నీకేలభయము:-అట్టిభ యమును పారద్రోలుటకే దీనిని పెద్దలుకనిపెట్టిరి.-

మాన—అటులైన మధుసేవ వదలఁగూడదన్నమాట ?-

విశ్వ—దానిని నిముసమేనియు విడువకుండ సేవింపవలయును. ఈసేవ కేసేవయు సందదు. సారాయము గడుపులోనున్నంతవఱకొక్క పెట్టున నూరుమందికి సమాధానముఁ జెప్పవచ్చును-

మాన—నీవు నేఁటినుండియు నాకుఁ గురుఁడవైతివి. ఇఁకనిన్ను విడువఁగూడదు.

విశ్వ—నీవు నన్నువిడచినను నేను నిన్నువిడతునా? మనకొక్క నిముసమేని యెడఁబాటుకలుగకుండునటుల దైవమునుఁ బ్రార్థింపవల యును:-

మాన—గురువునకు శిష్యుఁడు సేవఁ జేయుచుండవలయును గదా? అట్లయిన నాచేతిమీఁదుగ మీకు సారాయమును సమర్పించుకొందును.

విశ్వ—ఓ! నేను వద్దందునా?

మాన—(గ్లాసులోఁ బోసియిచ్చును)

విశ్వ—(త్రాగి) నాకీయుదరమెట్లువచ్చినదో నీకుఁ దెలియునా? దీనిమూలముననే. మఱినీవుఁ గూడఁ బుచ్చుకొనుము. త్వరగఁ దారయింటికిఁ బోవుదము?

మాన—(గ్లాసులోఁ బోసికొని త్రాగును) పోవుదమా?

విశ్వ—అభ్యంతరమా! నడువుము?-

మాన—(లేవఁ బోయితూలుచు) మిత్రమా! శరీరము తూలుచున్న దేమి?

విశ్వ—నూతనమగుటచేతనే కాని మఱొకటి కాదు. అది క్రమ క్రమముగా తగ్గిపోఁగలదు. కాని గోచి యూడుచున్నది. సరిగా సర్దుకొని నడువుము?

మాన—(సర్దుకొని నడచుచు) మిత్రమా! ఈప్రదేశమంతయు గిర్రునఁ దిరుగుచున్నదిసుమా?

విశ్వ—అట్లుండినఁగాని మనము తొందరగా తారయింటికిఁ బోఁజాలము. మనకీసారాయము మాకాశవిమానమంత సహాయము చేయఁగలదు.

మాన—తార మనలఁ జక్కఁగాఁ బలుకరించునా?

విశ్వ—నీకెందులకు? నిన్ను దానితొడమీఁదఁ గూర్చుండఁబెట్టినచాలునా?

మాన—ఆహా! తారతో నాకు సుఖమున్నదన్నమాటయే.

విశ్వ—పూర్తిగా:-

మాన—అట్లయినచో నాశరీరమంతయు దానికర్పణచేయు చుంటిని.

విశ్వ—నాకేమిమిగిల్చితివి?

మాన—సారాయమును గ్లానులును:-

విశ్వ—అంతియేనా? నిన్నక్కడ దిగవిడచి నేనిచటకురావల యునా?

మాన—వలదు. నాతోడిపాటు నీవుగూడ నానందమనుభవిం పవచ్చును.

విశ్వ—నన్నక్కడుంచుకొననిదే నీకుఁ బ్రయోజనమేమియును లేదు. దానినాడించవలయును. దానిచేఁ బాడించవలయును. మనప్రి క్కనుగూర్చుండఁబెట్టుకొని త్రాగించవలయును. మనము దానితో స్వేచ్ఛఁగాఁ బ్రవర్తింపవలయును. నీవు నూతనుఁడవు. నేనో యీకొం పలన్నియు ననేకపర్యాయములు తిరుగ బోర్ల వేసితిని. అట్టిచో నేనుం డవలదా?

మాన—ఓ! అన్నట్లుమరచితిని. పంచశరుఁడు తనబాణముల వాడిమిజూచుకొని మాటిమాటికిఁ బ్రతివారిమీఁదికిని దూకుచుండు నఁట. శివుఁడుగూడ వానిరూపమును హరించఁగలిగెనే గాని వాడియా యుధములనేమియుఁ జేయఁజాలకపోయెనఁట. గెలిచిన నట్టివానినే గెలు పవలయును. ఆక్రూరుఁడాయింతియింటనుండియేతీరును. నీవుచెప్పిన టుల రణశాస్త్రమునకును కామశాస్త్రమునకును జేరువసంబంధముం డనేయున్నది.

విశ్వ—మిత్రమా! ఇవన్నియు నేనెఱింగియుండియే నిన్నిప్పటి నుండియు నీలాటివిద్యలయందు మిన్నగనొనర్చితినేని తేపక్కటకురాఁ గలవని యీయుద్యోగమునఁ బ్రవేశించితిని. తెలిసినదా?

మూర్ఖ—తెలిసినది. మనమింకఁబోవుదమా? పోవుటకుముందే మఱిరెండుగ్లాసుల సారాయమును బుచ్చుకొనుటమంచి దేమో?

విశ్వ—అచటనీకుఁ గావలసినంతయిప్పించెదను. రమ్ము?

మూర్ఖ—వినను చెరియొకగ్లాసుబుచ్చుకొని పోవుదము. (అనిత నుత్రాగి మఱల గ్లాసునింపి స్నేహితునకిచ్చును)

విశ్వ—(త్రాగి) ఇఁకనడువుము. ఒడలు తిరుగుచున్నయెడనా బుజముపైఁ జేయివేయుము?

(అందఱు నిష్క్రమింతురు)



ద్వితీయరంగము.



(తారమందిరము)

తార—విశ్వనాథశాస్త్రిగారూ! నాతేరి?

విశ్వ—వసారాలోనున్న కుర్చీపైఁ గూర్చుండఁ బెట్టివచ్చితిని.

తార—రాకుమారుఁ డింటికి వచ్చుటయును, వసారాలోఁ గూర్చుండుటయునా? చాలుఁజాలు. తీసికొనిరండు?

విశ్వ—అదిగాదు, ముందుగ నీకుఁ దెలియఁబరచినచో ముస్తాబగుదువని యటులఁ జేసితిని.

తార—మాకులపువారికిది ముస్తాబయి సిద్ధముగ నుండుసమయమే.

విశ్వ—రాకుమారునికొఱకుఁ బ్రత్యేకముగా సింగారించుకొనవలసిన దేమైన నున్న దేమోనని.

తార—అటులైనచో నాలస్యమేమియు లేదు. మఱిరెండువాఁగములను తగిలించెదను. మొగమునకు మఱికొంత రంగుపూసెదను.

పెదవులకు నెఱ్ఱనిరంగు ద్దిదెదను. కోకను మార్చి పట్టు లంగాకట్టిదానిపై బనారసుఖండువా ధరింపజెదను. వీటికొఱ కెరవునకుం బోవలయునా? నాకు లేని వేషమున్నదా?

విశ్వ—రాకుమారుని పెట్టుపట్టు పిలుకలంగఁ జేయుచుంటిని. లేనివేషమైనను న్న దిప్పుడు పూర్తి చేసికొనవచ్చును. కాని రాకుమారుని కొఱకింత సారాయము సిద్ధపరచవలయునే?

తార—శాస్త్రిగారూ! వేశ్యల విషయము మీకెఱుంగరా?

గీ. ఎరకపువారు వచ్చిన ♦ యేనివారి
ప్రియమయిన కోర్కెలను దీర్ప ♦ వేశ్యకులము
సిద్ధముగనుండు వారికి ♦ బద్ధులగుచుఁ
గడుపుఁగాఁ జూతు రాత్ఫృటి ♦ కాలమమెలో.

మాగదిలోనున్న యలమారుఁ దిలకింపుఁడు. అందు స్వదేశసారాయములు గలవు. వాటి నుపయోగపరచి చాలకున్న మఱలఁ దెప్పించెదను. (అని చూపించివచ్చును.)

విశ్వ—వారిని తీసికొనివచ్చి నీకొప్పగించు వంతుఁ జెల్లించుకొంటిని. వారిని మెప్పింపఁజేసి మనయుభయులకు రాఁదగిన బహుమానము గడింపవలసిన నీవంతును జెల్లించుకొనవలయును.

తార—నాకేనా? తాము బోధించుచుండిరి?

విశ్వ—నీవన్ని విషయములందును బండితురాలవే. నేనెఱుంగుదు. ఐనను రాకొమరుని విషయమగుట చేతనుఁ బెద్దవాఁడనగుటచేతను నింతగాఁ జెప్పితిని. నేనింక వారిని తీసికొనివచ్చెదను. నీవు సిద్ధముగా నుండుము.

తార—ఓ! అభ్యంతరమేమున్నది?

విశ్వ—(వెళ్ళును)

తార—నాకోరిక నెరవేరినది. ఓ దారిద్ర్యదేవతా!

గీ. చెప్పితి ననేక విధముల ♦ శీఘ్రగతిని
తొలఁగిపొమ్మని, యైనను ♦ తొలఁగకుంటి
వదుగొని యార్భటులనెల్ల ♦ నడచు రాకు
మారుఁడే తెంచెడిని యేల ♦ మొరకుతనము!

తార—

గీ. ఈవఱకె యిచ్చుటను మధు ♦ సేవకులొక
యాటనాడించి నీదు యా ♦ ర్భాటములను
నగము హరియించినార లా ♦ నగముగూడ
నేలఁబోఁగొట్టుకొనెదింక ♦ నేనిఁబొమ్ము.

అంతియేగాక!

గీ. ఎప్పుడును బుట్టినింట నీ ♦ వేనిలువఁగ
నపుడు నొక మారిటువచ్చి ♦ యెగిరిపోవు
నీదు చెల్లి కొన్నాళ్ళైని ♦ నిలువవలదె
యెప్పుడును మెట్టినింటనే ♦ యుండవలెనే?

నేనింక నలంకరించుకొని సిద్ధముగ వచ్చెదఁగాక. (అని లోనికిఁ బోవును)

(అంత విశ్వనాథశాస్త్రి మానసింహునితోఁ బ్రవేశము)

విశ్వ—మిత్రమా! నీవీసోఫాపైఁ గూర్చుండుము.

మాన—మఱినీవో?

విశ్వ—నేనును గూర్చుండెదను.

మాన—తార యేదీ?

విశ్వ—లోనికిఁ బోయియున్నది. మనకుఁ గావలసిన వాటిని సిద్ధపరచవలయునుగదా?

మాన—ఓహో! అట్లనా! మనకు నేఁడు చక్కని జలసా జరుగు నన్నమాటయే.

విశ్వా—మనంతటివారము వచ్చుటయును మనకుఁ జలసాజరుగక పోవుటయునా?

తార—(సారాసీసాయును గ్లాసును బుచ్చుకొని ప్రవేశము)

విశ్వా—ఇదియేతార. నీపైవలపుఁగొని నీరాకకొఱకెదురు చూచున్న దీతారయే. నేను పాండిత్యము నుపయోగపరచుచు వర్ణించిన దీతారనే. నీవు చూడవలయునని వాంఛించిన దీతారయే. ఈయూరిలోని వేశ్యలనందఱ నందమునందును, సరసత్వమునందును, పాండిత్యమునందును, నాటపాటలయందును దిగదుడిచి పారవైచిన దీతారయే. ప్రతి దుకారమునందును జనవశీకరణము కొఱకలంకరించిన చిత్తరువు యీతారదే. తెలిసినదా?

తార— తెలిసినది.

విశ్వా—తారా ! ఏదీ! రాజకుమారుని ముందు నీచాతుర్యము నంతయుఁ జూపుము?

తార—మీరు సరసాగ్రేసరులు. సాహిత్యచక్రవర్తులు. సురూపవంతులు. మీయంతటి వారిముందు నేను జూపఁదగిన చాతుర్యమేముండును?

విశ్వా—ముందుగా మానసింహునకు (కనుసన్నఁజేసి) ఊ! కానిమ్ము?

తార—(గ్లాసునిండ సారాయమునుబోసి మానసింహుని తొడపైనిఁ గూర్చుండి త్రాగించును. మానసింహుఁడు త్రాగినయనంతరమున నొకముద్దుఁ బెట్టుకొని యావలకుఁ బోవుచున్నది)

మాన—ఒక్కముద్దు మాత్రమే పెట్టుకొని పారిపోయెదవేమి? నీకుఁ గావలసినన్ని ముద్దులఁబెట్టుకొనుము?

తార—ప్రస్తుత మొక్కటి చాలును. మనకుఁ గావలసినన్ని ముద్దులఁ బెట్టుకొనుటకుఁ గాలములేదా ?

మాన—అట్లయినచో నీగౌరవమును ముందు బహుమానముగాఁ గైకొనుము?

తార—బహుమానముల కేమి లెండు. మీకరుణయున్నదదియే పదివేలు.

మాన—శాస్త్రిగారికిఁ గూడ సారాయమునిమ్ము?

తార—శాస్త్రిగారు సారాయమును పుచ్చుకొనరేమోనని యూరకుంటిని—క్షమించుఁడు.

విశ్వ—కొంతనిలువుఁడు గూల్చితివేమండా! అందుకోసం మానివేసినావా యేమి? బట్టబయలుగా నడివీధిలోఁ దాగరుగాని యిటువంటి ప్రదేశములలో మాకేమియు నభ్యంతరము లేదు. చూచుకొమ్ము పొట్టను దీనియందు పీపాడు సారాయమున్నది.

తార—(నవ్వుచు) మఱియొకపీపానింపుకొనుఁడు. మహారాజుల యాశ్రయమున్నప్పుడు మీకేమిలోటు— (అనిగ్లాసులోపోసి యిచ్చుచున్నది.)

విశ్వ—నీవుకూడా పుచ్చుకొనుము, లేనిచో మాకుతృప్తి లేదు:

తార—నేనుకూడ నిప్పుడే పుచ్చుకొనినచోఁ గష్టముగదా? మీతోడిపాటుగ నేనుగూడనున్న మీకు సమయానుకూలముగ నానందములఁ గలుగఁజేయుచు మిమ్ములసుఖపెట్టువారెవ్వరు?

విశ్వ—నిజమే; నీవుచెప్పినదిగూడ నాలోచింపఁదగినవిషయమే. కాని యేదీ! నీయభినయశాస్త్రమును నేను మానసింపుటకుఁ జూడవలయును.

తార—వారియనుగ్రహముండవలయునుగాని దానికేమిఁ కొఱత.

మాన—విశ్వనాథ్! నాకును ఆకోర్కె చాలాకాలమునుండి యున్నది.

తార — మీరు మానాట్యమును వీక్షించి మానందభరితులు గావలయునన్న తనివిదీఱ నీసాహాయమును గోరవలయును.

మాన — అట్లయినఁగానిమ్ము. నీయాజ్ఞనుమీరువారెవ్వరు?

తార — (గ్లాసులనిండబోసి తనివిదీఱఁ దాగించఁగా వారిరువురును త్రాగుదురు) నేనింకనభినయించెద.

మాన — ప్రారంభించుము?

కీర్తన! భైరవిరాగం.

తార — రారా నాసామీరాయిరా! రాకొఁగిలివేగ
మారునిపోగరుహరి! మార్చెదతృటిలోన ॥రారా॥
(అభినయించుచుండ)

మాన — ఆగుమాగుము. ఏడీయాగర్వపోతు! వానిత్రుళ్ళడంచెదను,

విశ్వ — అడఁచి తీర్చవలసినదే?

తార — రారావానామీరాయిరా! రాకొఁగిలివేగ
మారునిపోగరుహరి! మార్చెదతృటిలోన ॥రారా॥
(అని మరియొక విధాభినయము)

మాన — నీకేమియు భయములేదు. మానసింహుఁడనఁగా రాజపుత్రుఁడనుకొంటివా? పిటికిపందగాడు. తరువాత గానిమ్ము?

క్రూరుని శరముల! గ్రుచ్చెనీతనువున!

విశ్వ — మానసింహా, కత్తిదీసుకో! ప్రతివారిమీఁదను దండెత్తుతాడఁట. ఈదెబ్బతో వాఁడు నాశనముగావలయును. వాకీవెధవపోట్టయొకటి అడ్డమువచ్చినదిగాని లేనిచో నివఱకే వీడిగర్వము నూడ్చివారవేతును.

తార — దారుణబాధలకు! తాళఁగఁజాలను ॥రారా॥

విక్రమ—(చివాలునఁ బ్రవేశించి) మానసింహా! ఇదియేనా వరుస?

గీ. కేకిమహారాజపుత్రుఁడు ♦ కీర్తిఁదొలఁగి
త్రాగితిరుగుచునున్నాఁడు ♦ తండనాల
నాఁడుచున్నాఁడు వేశ్యాగృ ♦ హంబునంద
టంచుఁబ్రజగోలపెట్టుటా ♦ లించినావె?

మాన—(తలవంచుకొని తూలుచు నిలువఁబడుచున్నాఁడు)

తార—(భయముతో నావలకుఁ బారిపోవుచున్నది.)

విశ్వ—(తెల్లబోయి చూచుచున్నాఁడు)

విక్ర—బాలకా! తేపో మాపో పట్టాభిషిక్తుఁడవై యీధరాభారము వహింపవలసిన నీవు; సుక్షత్రియలాంఛనంబైన ఖడ్గరాజంబు ధరించి యరికులారణ్య చండదావానలునిరీతిఁ బ్రవర్తింపవలసిననీవు; ఈతురుష్క పరిపాలనమునందు దినదినగండంబుగ నడపించుచున్న యీరాజపుత్రసంస్థానమును పరిపాలింపవలసిననీవు; ప్రజలచే సెబాసనిపించుకొను నాగుణములనలవడఁజేసికొని గౌరవకీర్తుల నందవలసిన నీవు; యోధానయోధుల నందఱి నడిపించువారిమధ్య దేదీప్యమాన తేజోవిరాజితుండవై వెలుఁగవలసిననీవు; నడువవలసినదారి యిదియా? ఓయీ! శాస్త్రీ! అగ్నివంశమునకైనవారియింటఁబుట్టినసంస్థానమునఁబురోహితోద్యోగివై యుండి యువరాజునకు నేర్పవలసినబుద్ధులివియేనా? సిగ్గుబిడియములు లేవా? మానాభిమానములు లేవా? రాకుమారా! అటులఁదలవంచుకొని నిలువఁబడెదవేమి? మందిరమునకు నడువవేమి? ఎట్టిరహస్యమందిరమైనను నాకుఁ బ్రవేశింప నధికారము లేదనుకొంటివా? తారయింటికివచ్చి నిన్నుఁగనుఁగొనలేననుకొంటివా? ఓశాస్త్రీ! నీవింతటితోనైనను బుద్ధిందెచ్చుకొనక యిదేవిధముగాఁ బ్రవర్తించుచున్నచో నీకీయుద్యోగమూడుటయేగాక యీరాజ్యపుసరిహదు

లలో నెచటను నిలువనీడయేని లేకుండునటులఁ జేసెదను. నడువుఁడు. నడువుఁడు. ఓసీతారా! ఎన్నడేని యిఁక ముందు వీరిచటకు వచ్చినచో నా కెఱుకపరుపకున్న నీతలఁదీయించి కోటగుమ్మమునందు వ్రేలాడఁ గట్టించెదను. జాగ్రత్త.

(శాస్త్రియు మానసింహుఁడును వెనుకవెనుకఁ జూచుచు వీర సింహుని వెంటనడచుచుండఁ దెఱవ్రాలును)

## —తృతీయరంగము—

ప్ర—(రాణీపురపు సరిహద్దులందు రహిమత్ ఖానుడేరా)

(ప్రవేశము రహిమత్ ఖాను పరివారసహితుఁడై)

రహి—వజీరల్లీఖాన్. కేకీమహిరాజ్ మసకాళిద్కా వస్తాడ్ లేదూ?

వజీ—నేఁడేగద్యూధినం వస్తాఁడ్.

రహి—మతీ! మున్నా రాణీపూర్ సంస్థానంవారి యుద్ధావ్వావాలు తోటలు కోటల్ చూపటానికీమన్నావుండాడ్. రాజాసాహెబు కాముందు వరత్మానం చేయ్యాలావుంది.

వజీ—అచ్ఛా! హుకుం పంపుతాం.

రహి—వజీ! రాజాసాహేబ్ కూతుర్ సద్ధర్భావుందీలేద్. దాని హందం దాని చందం దానినీటూ దానిగోటూ దానిరీకూ దానికాకూ బహులచ్ఛాగావుంటుంది, అని మాపానాల్యాడికీ తెల్చిఁదీవుంది. మరీ దానికీ నూడాలా హంటేమల్లీ యెట్లా?

వజీ—అదీ మాకీయిచారంచాయ్ నిద్ధెమూ చివుదూగుడివుంది లేద్. దానికీనూడువాలా అనిపోతూవుంటాడు. మనకీదారిల్లో తల్లుగ్ కాడ్ అని నాయిదారగాలో తేలింది.

రహి—అయితే మన్ముహంతక్వురాల్ మీకిమంచి పోవాలా. మళ్లీ ఆదారిచేరవాలావుంది.

వజీ—అవును.

రహి—దానికీ మాకన్నుల్ వాడూ ఖులాయించి సూసింది అంటే మూపానాల్వాడు గాబ్రాయిచేస్తే మీకీసిద్ధంవుండాలి. పకడో అంటే పట్కోవాలా?

వజీ—జరూర్ నహి! మహారాజ్ బచ్చానహీ! ఆడ్కోమనము జల్సాల్ మీాద జల్సాల్ తగ్లీపించి గుమ్మునేసిదీఅంటే ఆళ్ల ఆడస్త్రీల్ హంతా మనపాదాల్వాడీకాళ్ల మీాద వుండాలిఅన్నమాట. మాకీ హాలోచనాసిస్తాయ్ ఫికర్ నహీ ఫికర్ నహి!

రహి—మాకీదిరీసు గిరీసు యేసొక్కని వస్తాయి. నీకీకూడా సిద్ధంచేస్కొనిరా జావ్.

వజీ—అచ్ఛా!

(అని యిరువురు నిష్క్రమింతురు.)

---

## చతుర్థరంగము

శివాలయమునుండి రాజమందిరమునకు రహస్యపుత్రోవ!

(ప్రవేశము రూపావతి సర్దార్బ)

రూపా—మఱదలా! నీకంతభయమేల నమ్మా?

సర్ద—పిల్లి యెదురువచ్చుట దుశ్శకునమనియు దానిమూలమున నగొప్పవిపత్తునకుఁ బాల్పడవలసివచ్చుననియుఁ బెద్దలు చెప్పుదురు. అంతియగాక వాటివలన విపత్తులనందినవారినిగూడ మనమొందరినో చూచియుంటిమి.

రూపా—అదిల్లియే నాకుమాత్రి మెదురురాలేదా ? నాకు లేని భయము నీకేలనమ్మా ?

సర్ద—నన్నారడెంత నీవెంతయుత్నించినను నాకు ధైర్యము కలుగకున్నది.

రూపా—మఱిదలా!ఒక వేళ విపత్తేసంభవించుననుకొందము. అంతమాత్రమునకు భయపడ నేలనమ్మా?

గీ. మనము రజపుత్రకులమున ♦ జననమంది?
పౌరుషము ధైర్యమును సుగ్గు ♦ పాలఁ తోడ,
త్రాగి యీస్వల్పమునకు నై ♦ దైన్యమంద
వంశమునకుమచ్చఁ గూర్చిన ♦ వారువీరె!
యనుచు గేలి నొనర్చరే ♦ వినినవారు॥

సర్ద—(అటునిటుఁజూచి) వారెవరమ్మా?

రూపా—వారెవరైన మనకేమి? మఃత్రోవను మనము పోవుదమురమ్మా?

సర్ద—వదినే! వారు తురుష్కులవలె నున్నారమ్మా? నాకు మిక్కిలి భయమగుచున్నది. తొందరగాననుమమ్మా?

రూపా—భయములేదు తురుష్కులే కానిమ్ము వారితాతలే కానిమ్ము. మనచేతులయందీ బాకులున్నంతవఱకేమియు భయము లేదు.

సర్ద—మనరజపుత్రింగనలనినఁ దురుష్కులెట్టి సాహసకార్యములకైన సంసిద్ధులైయుందురు. అంతియగాక వారికికరుణ యను నది శూన్యము.

రూపా—సర్దార్బా! మనరాజపుత్రులలోఁ దురుష్కులకులోంగువారెవరమ్మా? వారిసాహసకృత్యములు మనలనేమి చేయగలవు? మనయాడు ండుమాత్రము. సామాన్యురాండా? సంయుక్త, పద్మిని

వీరాబాయి, రామాబాయిమున్నగు మహాపతివ్రతలు తమ ధైర్యసా
హసముల నుపయోగపఱచి మానసంరక్షణము గావించుకొనలేదా?
మఱియు నెందఱు తురుష్కులు తమ ప్రాణముల మనవారి ఖడ్గరా
జంబులకు సమర్పించిరి. మనపూర్వీకుల పవిత్ర చారిత్రములనైన జ్ఞప్తి
కిఁదెచ్చుకొని ధైర్యముగనుండుమమ్మా?

సర్ద—(వెనుకకు జూచుచు) వారుమఱింతచేరువకు వచ్చి
నారమ్మా?

రూపా—మఱఁదలా! నీప్రాణమునకు నాప్రాణమడ్డముచేసెద
ను. భీతినందకుము

సర్ద—ఏమోనమ్మా! వదినే! నన్నటుల మందిరమునకుఁ జేర్తు
వో భారమునిది.

రూపా—నావచనము లేమియు నీచెవుల కెక్కకున్న నేమి చే
యుదునమ్మా?

సర్ద—వదినే?

గీ. కలకమీఱిన మనసుంగ ♦ కనులవెంట
దొఱలునీటితో నేమియుఁ ♦ దోచనట్టి
సమయమున నీదుపల్కులే ♦ సరణినాకు
వినఁగవచ్చెడి? భీతియె ♦ వ్యాధిఁ దొలఁగెడి।

రూపా—అట్లయినఁ దొందరగానడువుము?

(ఇరువురును నడచుచుండఁగా రహిమత్ ఖానును
వజీరల్లీఖానును పరకాయించి చూచుచునడచుచున్నారు.)

సర్ద—వదినే (రహస్యముగా) మనము వీరిబాఱినుండి తప్పు
కొనుటయెట్లులమ్మా?

రూపా—నీదారిననీవు నడచిరమ్ము. (పరిక్రమింతురు.)

రహీ—వజీర్ దేఖో! మహారాజ్కా అచ్ఛాఖూతుర్ వుండింది. దానికీ మాక్షీప్యారీసేస్తే మాపాదాలవాడ్ చుకంపడ్తాయ్. హెడ్డా పోతుందో దేఖో.

వజీ (నెమ్మదిగా వెనుకకు నడచిచూచుచున్నాఁడు.)

సర్ద—(వెనుకకుఁ జూచుచు) ఏమన్నా! ఈతుకుష్కుఁడుమన దెసకేవచ్చుచున్నాఁడు గతియేమి?

రూపా—వారలనైజస్వభావమును గనఁబరచుకొనుచున్నారు. నీకెందులకు నీవునడువుము.

రహీ—వజీర్ సాహేబ్ మూఘుండెల్ వాడ్కా ఘాబ్రీసేస్తాయి మాకీఘుర్యా పోతాయి అవ్.

(ఇరువురు నిష్క్రమింతురు)

సర్ద—మనము బయలుదేరి చాలసేపయినది. ఇంకనైనఁ ద్వారగమందిరమునకుఁ జేరుదము రమ్ము.

రూపా—నడువుము.

(అని నిష్క్రమించుచున్నారు.)





# సతీసర్దార్బా.

## ద్వితీయాంకము

---

### ప్రథమరంగము.

(రహిమత్ ఖాను, వజీరల్లీఖాను)

రహి—వజీర్ సాబ్! కేకిమహారాజా ఆయా?

వజీ—ఆయా.

రహి—బులావ్?

వజీ—(వెడలి మరల కేకి మహారాజును, మానసింహుని, విక్రమసింహుని వెంటఁబెట్టుకొని ప్రవేశించుచున్నాఁడు.)

కేకి—సర్కారు వారికి సలాములు.

రహి—సలాం. సలాం. బైఠియే మహారాజాసాప్! ఓఅద్మికోన్, ఓఅద్మికోన్.

కేకి—సర్కార్! ఇతఁడు నాకుమారుఁడు. పేరు మానసింహుఁడు. వీరు మామంత్రుల వారు. పేరు విక్రమసింహుఁడు.

రహి—అచ్ఛా! బైఠో. బైఠో! మాకికప్పం తెచ్చివుండారు అని తలుస్తామ్.

కేకి—అవును.

రహి—అచ్ఛా! వజీర్! దాఖల్ సేసుకోండి. మహారాజ్! మీకీ అంతాషుకం వుండార్?

కేశి—మీదయవలన ?

రహి—మీ కేశామంచీవుండాడ్ వారికీమూస్తే మాకీషంతోషం తల్గింది. అచ్ఛా! మానసిమ్ మహా రాజ్! మామకాంమేనాల్గువినాల్ వుండి మాకానందం సెయ్యవాలా? అని మామనస్సుల్ వాడ్కి బుద్ధితల్గిందీవుంది. మీకీయిష్టంవ్వుండింది మాకీషంతోషం వుండింది.

కేశి—మీవాలుకుమును మేము తిరస్కరించెదమా? తమచిత్తానుసారమట్లనే యుంచుకొనవచ్చును. మానసింహా! సర్కారువారు కోరిన రీతిని నాలుగు దినంబులిచట నేయుండి వారి యనుమతిఁబొంది

రమ్మ—సర్కారు! మాకు సెలవుదయచేయించెదగా ?

రహి—అచ్ఛా! సలాం. సలాం!

(అని లేచివారిని సాగసంపుచున్నారు)

రహి—మానసింగ్జీ! మనకీ జల్సాసేస్తాయి. ఆనందంగా కాలక్షేపంసెయ్యాలా ?

మాన—మామిత్రుఁడు విశ్వనాథుఁడుకూడ నున్న చాలా బాగుండునుగదా ?

రహి—మనకీ పిల్పిస్తాయ్-వజీర్-బరాంది-సారా-గీరా, ఫులావ్-గిలావ్ కేశరాల్-విశన్ నాథకా వర్తమానంసె య్యవాలా వుండింది.

వజీ—అచ్ఛా! (అని నిష్క్రమించుచున్నాఁడు)

రహి—మానసింగ్జీ! మీకీజల్సాఅంటే చాలా హిష్టంవుందీ అని వింటామ్.

మాన—అవును. దానికి మావిశ్వనాథుఁడే గురువు. దాని మహాత్మ్యమును నేను బాగుగా పరిశీలించితిని.

గీ, డెందమున కింత చింతవా ♦ టిల్లెనేని,
యొదయిన బాధకలిగిన ♦ యేని, తగిన

రోచనమొనర్పఁగా గూరు ♦ చున్నఁగాని
హాయిగాఁ గాలమును బుచ్చు ♦ నప్పుడుగాని
చేయఁగావలె నుదిం మధు ♦ సేవమనము.

రహి—మాకీమంచీ మస్నీవుండాల్. మహారాజ్ ! యింకా బోలో ! దాని మాత్రేము.

మాన—చిత్తము.

గీ. వేశ్యగృహంబునకుఁ బోవు ♦ వేళ, ద్యూత
మునకు వెడలెడి వేళ, ల ♦ మనము తప్ప
కుండమధు సేవ నొనరించి ♦ యుండవలయు
లేనిచో యందు సౌఖ్యమే ♦ లేదు లేదు.

రహి—బహుత్ అచ్ఛాహై ! అవుర్ క్యా ?

మాన—గీ. అగ్నితోఁ గాని నీటితో ♦ నైనఁగాని
శాత్రవులతోడఁగాని బల్ ♦ శౌర్యముగను
నెదురుకొనుటకు ధైర్యము ♦ నిచ్చుగాన
మనకు మధు సేవ ప్రాముఖ్య ♦ మనఁగవచ్చు.

రహి—మళ్లీ !

మాన—గీ. వెంటఁబడిమంది యుండెడి ♦ వీలుఁ వారు
మనకు బానిసలౌచును ♦ మసలం వీలు
కొండమీఁది కోతినైన ♦ కొనియొసంగు
వీలు, మధు సేవ యందున ♦ జాలఁగలదు.

రహి—ఇంకా సెప్పూ భాయ్?

మాన—గీ. మేజువాణిలలోన బల్ ♦ మోజుఁజూడఁ
దగిన యుత్సాహము నొసంగు; ♦ దానకర్ణు
లనెడి గౌరవమును దెచ్చు ♦ నందువలన
మనము మధు సేవఁ జేయుటే ♦ ఘనమునమ్ము;

రహి—అచ్ఛా! అవుర్ ?

మాన—గీ. ఇన్నిమాటలేల ♦ నన్ని వేళలతోడు
నీడగాగ మనల ♦ గూడియుండు
గాన నెప్డువిడువఁ ♦ గారాదు మధుసేవ
కులఁపుదైవమాచు ♦ గూర్చుముదము.

వజీ—(ప్రవేశము) సర్కార్! అన్నిసిద్ధంగా తెచ్చినాము?

విశ్వ—(ప్రవేశము) సర్కారు వారికి సలాములు చెప్పుకొందుము.

రహి—వజీర్! సారా లావ్ ?

వజీ—అచ్ఛా! (అని తెచ్చియిచ్చును.)

రహి—మానసింగ్జీ! (గ్లాసులో సారాయమునుబోసి ఇచ్చి) పుచ్చుకోండి?

మాన—(సంతోషముతో పుచ్చుకొని) సాహేబ్జీ! సలాము. సలాము.

రహి—విశ్వనాద్జీ! (గ్లాసులో బోసియిచ్చి) పుచ్చుకోండి మీరు.

విశ్వ—(సంతోషముతో పుచ్చుకొని) సాహేబ్జీ! సలాము, సలాము. తాముకూడా పుచ్చుకొనండి?

రహి—మాకీయేస్తాందేఖో (గ్లాసునిండ బోసికొని తాగుచున్నాఁడు) అచ్ఛా! వజీర్! కంచన్కు బులావ్?

వజీ—(వెళ్లి తారతోఁ బ్రవేశించును)

రహి—తారా! ఒకపాటపాడి నీయాట నీసోకూ నీఠీకూ మాఖన్నుల్ పాడ్కినూస్తే మాకీఈనాందేతుమ్? అచ్ఛాగావుండ్వాలా?

తార—చిత్తము!

కీర్తన—రాగంతోడి—రూపకము.

అందగాడ నాతోడి ♦ పొందుగోర వేలరా!

(అని యభినయించును)

రహి—అదీకాదూబే. ఓమహారాజ్ కాడ ఖూఖుండి మజాసె గొయ్యాలావుంది!

తార—(మానసింగుకడకువచ్చి)

అందగాడ నాతోడి ♦ పొందుగోర వేలరా!

(అని యభినయించును)

విశ్వ—ఓసి పిచ్చముండా! ఆముండాకొడుకు సమయానికి వచ్చి రసభంగం చేశాడుగాని లేకపోతే నీవామహానుభావుని అంతదీనంగా వేడాలా?

మాన—అవును. మిత్రమా! సమయానుకూలముగా సమాధానమిచ్చుచుందును?

తార—ఎందాకనితాళుదు నా కందర్పుని బారికేను ॥అం॥

(అని యభినయించును)

విశ్వ—మిత్రమా! రాజపుత్రులకు శరణాగతరక్షణమవశ్యకర్తవ్యమని పెద్దలు చెప్పుదురు. పాపము. దానినంతగా యేడ్పించఁగూడదుసుమా! మరిరెండు గ్లానులఁ గైకొనుము?

రహి—దేఖో! మహారాజ్. మాకీ యేమీతఖ్వా లేద్. (అని పోసియిచ్చుచున్నాఁడు)

మాన—(త్రాగుచు ఊఁ! ఇఁకఁగానిమ్ము?

రహి—శాస్త్రిజీ! మీరూకూడా యేస్కోండి (అనియిచ్చును)

విశ్వ—(త్రాగును) తారా! కానిమ్మ?

తార—వాడివాడి తూపులకు ♦ నోడిన యాతనువుఁగని నీ

వాడిమి జూపింప నన్ను ♦ గూడి యాదరింపవేర॥అంద॥

(అని యభినయించుచుండ)

మాన—(చివాలునలేచి)

గీ. ఏమిరాకూ్రర నాదగు ♦ భామినిపయి

రేగుచున్నాఁడ వింకేడ ♦ కేగెదీవు

మానసింపఁడు నీమాయ ♦ మర్మములను

నేఁడు భస్మముఁజేయఁగా ♦ బోడె తులువ.

ఇదె వధ్యమంటిని. కాచుకొనుము. (అనికత్తిదూసి వరుగెత్తుచున్నాఁడు)

విశ్వా—మిత్రమా ! ఎచటకుఁ బోయెదవు ?

మాన—ఎవరు దీనిపై మాటిమాటికి బాణములవేయుచు (అని తారచేయిపట్టుకొని) కోమలంబగు యాశరీరమును. (అనియేమిమో చెప్పుచుండ)

తార—ప్రాణప్రియా ! ఒక్కముద్దుఁ బెట్టుకొందునా ?

మాన—ఒకటిగాదు. వేయిముద్దులఁ బెట్టుకొనుము? నిన్నువద్దంటినా ? ఈశరీరమంతయునీది. నన్నడుగవలెనా ?

తార—(ముద్దుఁబెట్టుకొని) ప్రియా ! మదనుని గర్వమణఁగి పోయినది సుమా ?

విశ్వా—కత్తులు కఠారులవసరము లేకుండఁగనే టుప్పునతొత్తు కొడుకెగిరి పోయినాఁడే ?

తార—మీయొడలికి చందనగంధమును బూయుదునా ?

విశ్వా—రసభంగముఁ జేయకు. చందనగంధమవకు. రెండుగ్లాసుల సారాయమును నోటిలో పోతునా యనుము?

తార—పొరఁబడితిని. క్షమింపుఁడు ! మనోహరా ! ఉండుము. మీకుఁ బరిపూర్ణానందముఁ గల్గింప నాచేతిలో మీకు సారాయమి

ద్భుతము. (అని సారాయమును గ్లాసులో పోసి నోటిలో బోయుచుఁ దాగిన పిమ్మట చెంపఁ పైఁగొట్టుచున్నది)

విశ్వ—ఇప్పుడూ దాని యానందము. బహురక్తిగా నున్నది

మాన—మిత్రమా ! ఆనందము మాత్రమే కాదు. పరమానందము. బ్రహ్మానందము. ఈ యానందములోఁ దన్మయత్వముందుటచేత నే నాకు సుఖమైన నిద్రవచ్చుచున్నది.

రహి—మీకీ నిద్రాసేస్తే ఠీకం నహీభాయ్. మనం కంచనీకు పంపిచేసి జూదంఆడ్దామ్. మీకీ చేతావస్తుంది. లేదూ?

మాన—ఓ! దానికేమి! కానిండు?

రహి—తారా ! తూ! జావ్. ఫిర్. ఆవ్.

తార—సెలవుఁ గైకొందును. (అని నిష్క్రమించుచున్నది)

రహి—(పాచికలను సిద్ధపరచుచున్నాఁడు) దేఖో. మహారాజ్! మాకీ పందెంయేస్తాయి. (అని మెడలోని హారమును దీసి పందెముగా నుంచును.)

మాన—నేనుగూడ నాహారమును పందెమిడుచున్నాను (అని తీసిపెట్టును.)

రహి—(పాచికలు వేయఁగా)

మాన—ఉండుఁడు. ఉండుఁడు. గెలుపుమాదియే ?

రహి—మళ్లీ హారం ఉంచుతామ్. దేఖో (పాచికలు వేయును)

విశ్వ—ఆఁ (నవ్వుచు) ఇప్పుడుగూడ మాదే గెలుపు.

రహి—ఓ అచ్ఛానహీ ! మాకీ ఒక తమాసా చెప్తాయ్. ఈ పాలిపందెం మీకీయొయ్యండి. మీకీ గెలిస్తే మాదీరాజ్యం మేసఖం యిస్తామ్. మాకీ గెలిస్తే మీ చెల్లెల్నీ మాకీయిచ్చి నికా సెయ్యాలా! ఫకేనాఅండి ?

మాన—ఓ ! దానికేమి ! ఇదుగో పాచికలవేయుచున్నా చూడుడు?

(అనివేయును.)

రహి—మాకీ గెల్చింది.

విశ్వ—మాన—(తెల్లబోయి చూచుచున్నారు)

రహి—అచ్ఛా! మాన్‌సింగ్ ! సర్దార్బాకీజల్దీలేకరావ్?

మాన—మాదిరజపుత్రవంశము. అనినమాటను దప్పుదుమని యనుకొనుచుండిరి గాఁబోలు? అటులెన్నఁటికిని జరుగదు. ఇదుగో! యిప్పుడే పోయితీసికొనివచ్చి వప్పగించెదము. శాస్త్రి రమ్ము?

(అని యిరువురు నిష్క్రమింతురు)

రహి.—వజీర్. పందెం గెల్చినామ్. హల్లాకటాచ్ఛం మనదిగా దవుండింది గన్క—నే బహుత్ దర్జాఅయిన పిల్లకికొట్టేయేశామ్. మన్కీ యేంతఖ్యా. రానీముద్దుల్ మీాదముద్దుల్ తిన్పించి మాపానాల్యాడ్కీ చుకంచెస్తామ్.మాకీదిరీస్ గిరీస్ యేసీ మీాసాల్కీ గడ్డాల్కీ—రంగూతలీపించీ పెళ్ళీకొదమ్క—లాఖా ఖూకుంటాంమసాజ్లీకిపిల్చిఅంతాబాగాసెయ్యా లాఅనిమాలుకుంసెయ్యాలా. జల్దీచెలో.

(అని అందఱు నిష్క్రమింతురు.)

---

యవనికపడును.



(ప్రవేశము రూపావతియు మానసింహుఁడును)

రూపా—భ్రష్టస్యకావాగతిః అనుశ్లోకమున కనుగుణ్యముగ వర్తించిన మిమ్మునఁజూచుటకే నాకు సిగ్గగుచున్నది. ఇంతకన్న ఘోర ముండునా ? ఈమద్యపానము హైందవసాంప్రదాయమేనా ? ఆర్య

మతధర్మమేనా ? మనరసపుత్రవంశంబున నెవ్వరేని మధుసేవ నొనర్చిరేమో యెఱింగితిరా ! లోకులు పరిహసింతురని, ప్రాణ, మానధనంబులఁగోల్పోవ వలసివచ్చునని, గుర్తింపవలవా ? ఈమధు పానవ్యధచే భ్రష్టులైన వారి చరిత్రములనైన స్మరణకుఁ దెచ్చుకొన వలదా ?

మాన—ప్రాణేశ్వరీ ! ఎందులకు నన్నుఁ జీవాటులఁ బెట్టె దవు? ఇఁకముందెన్నఁడును దానిజోలికిఁ బోవువాఁడను కానుగాని నామా టనొకటి వినవలయును.

రూపా—మీరీదురుద్యోగము మానుకొనెదనని యొట్టుఁబెట్టు కొనినచో విందును.

మాన—వినుటయే కాదు. నాకోరికనెరవేర్చు భారమునీది. నీవు కోరిన రీతిగా నొట్టుఁబెట్టుకొనెదను.

రూపా—మీకోరికయేమో సెలవిండు?

మాన—చెప్పెదను. నెరవేర్చెదనననఁ జెప్పెదను. తప్పక నెరవేర్చెదవా ?

రూపా—సాధ్యాంతరములఁ జూచెదఁ జెప్పుము!

మాన—మన సర్దర్ఖాను జూదము నందోడిపోతిని. నేనిప్పుడే రహిమత్ఖానుప కొప్పగించవలయును. కాన యీవిషయమును మన సర్దర్ఖాకుఁ దెలిపియామెను వినిపించి నామాట నిలుచునట్లు చేయు వలెను.

రూపా—(కోపముతో) ఆఁ, ఎంతగొప్పపనిఁ జేసి వచ్చిరి! సోదరీమణిని తురుష్కునకోడి వచ్చితిరిగా ! పొండు. పొండు. ఆవలకుఁ బొండు ! మఱల నావద్దకు వత్తురా ?

మాన—సుందరీమణీ! నీపాదముల నొత్తెదను. నామాన
మును గాపాడుము?

రూపా—పాదముల నొత్తుటనేమి చేసెదరు?

గీ. సోదరిని సిగ్గులేకుండ ♦ జూదమందు
నోడిన మహానుభావుఁడ ♦ వీవొత్తెదనవె
ఆడువారల పాదాల ♦ నందుచేత
గలుగునే సిగ్గు? యిదియొక ♦ ఘనతయగునె?

మాన—ప్రాణేశ్వరీ! నామానమును గాపాడుము. నీకుఁబు
ణ్యముండును. నన్ను దిట్టినను సరియే. నిన్ను బ్రతిమాలికొందును.

రూపా—మీకు మానమనియు నభిమానమనియుఁ గూడఁ గ
లదా? స్వసోదరీమణిని జూదమునందోడిపోవుట మానాభిమానము
గలవారికృత్యమే నా? కుత్తుకనిండ ద్రావి తుణేకమేనియు మత్తునువిడ
నాడలేకుండుటఁ బౌరుషము గలవారి చెద్యము లేనా? వేశ్యాలంపటు
లై యిల్లువాకిలనకఁ బ్రవర్తించుట సిగ్గుబిడియములుగలవారి లక్ష
ణము లేనా? రజపుత్రవీరలక్షణంబులఁ బరిత్యజించి నీచకృత్యములకు
బాల్పడుట గౌరవనీయుల ధర్మమేనా? మీరొనర్చిన పాపంబున
నేనుఁగూడ భాగముఁ బంచుకొనినఁగాని నాకు బుణ్యము లేదు కాఁ
బోలును. మోక్షము లేదు కాఁబోలును. కీర్తి ప్రతిష్ఠలు లేవు కాఁబోలును.
చేసిన కార్యము చెడ్డదైనపుడు, పరులచే ఛీ యనిపించుకొనఁదగినదైన
పుడు, హైందవమతధర్మవిరుద్ధమైనదైనపుడు దానిని సమర్థించుకొనుట
కు నన్ను బ్రతిమాలకేమి చేసెదరు? అయ్యో! ఒక్కతల్లిగర్భమునఁబు
ట్టితిరే, ఒక్కస్తన్యమునే గుడిచితిరే, ఒక్కచోటనే గుడిచితిరే, ఒక్క
చోటనే పెరిగితిరే, అవిశ్వాసమైన లేదా? పాపభీతి లేదా? వదురు
బెదురు లేదా? అన్యమతస్థునకు వందులో నాగర్భశత్రుమతస్థునకు
సోదరీమణిని కట్టిపెట్టి తలయెత్తుకొని తిరుగుదమనియేనా మీతలం

ఇదిగర్భనిర్భేదకమగు విషయముగాని మఱియొకటియా? నేనీ కార్యమునకెట్లు లనుమతించగలను? ఆమెతో నేమని వచింపఁగలను? నాకునీరెటులవచ్చును? దీనిని విని యామె యేమనును? మొన్నశివాలయమునకుఁ బోయినపుడు గలిగిన యపశకునమునకే భీతిలి యుంతవఱకును విచారగ్రస్తయైయున్న నాకాంతతో నీవిషయమును దెల్పనిదిసమయమా? ఒకరికిఁదెలియకుండఁ జేయఁదగిన కార్యమా? ఆమె స్వతంత్రియా! పైనఁదలిదండ్రులు లేరే? నేనిట్టి కార్యమునకుఁ బూనుకొనినచో నాగతియేమి కాఁగలదు? నాథా! నామనవివినుఁడు. పోయినదై పోయినది. మీరింక నాతురుష్కునికంటఁబడకుఁడు. ఈవిషయమునుగూర్చి తలపెట్టకుఁడు.

మాన—కంటఁబడకుండ డాగికొనినంతమాత్రమున వాఁడూరకొనువాఁడా?

రూపా—ఊరకొనక నేమిచేయఁగలఁడు?

మాన—యుద్ధమొనర్చియైనఁ జెట్టఁబట్టఁగలఁడు.

రూపా—ఓస్ ఇంతియేకదా! తురుష్కులతో యుద్ధమునకే జంకుచుండిరా?

మాన—ప్రాణేశ్వరీ! యుద్ధమనమాటలా?

రూపా—మీయట్టి భీరులకు మాటలుగావు. పోటుమానినులకు మాటలే.

మాన—కాలహరణమొనర్చి నన్నుగష్టముల పాలొనర్చుటయేనా? నాగతి నేమిచేసెదవు?

రూపా—నామాటవినుఁడు. మీకేమిగష్టములు రావు, మీకేమియుదుర్గతిగలుగఁబోదు. మీప్రాణములకు నాప్రాణములడ్డువేసెదను. మీరుభయపడనక్కఱలేదు.

మాన—నీవుభయపడవలదని చెప్పినంతమాత్రముననే నాకు ధైర్యముగలుగుననుకొంటివా ? నిష్కారణముగా వానితోపగయేమిటికి? ఎందఱునిహతులుగావలయును? ఎన్నిదినంబులు కష్టపడవలయు ? సుందరీమణి ! కోటితోఁ బోవుదాని నేల కొద్దలిఁ బూనఁజేతువు?

రూపా—ఏమికానున్నదో కానిండు. మీరుయిచ్చోటనుండి పొండు.మీతోడనిప్పుడు మాటలాడుటకుఁగూడ నా మనస్సాక్షియంగీకరించకున్నది. ఇదికోటితోఁబోవుకార్యమా? మహాఘోరమైనది. నీచాతినీచమైనది. ఈహేయకార్యముకన్న యుద్ధము నీచమైనదిగాదు. చూడుఁడు!

గీ. ఏఱులుగ రక్తమీయిలఁ ♦ బాఱుఁగాక
కోట్లకొలఁదిగ జనములఁ ♦ గూలుఁగాక
రాజపుత్రవంశస్త్రీ తు ♦ రుష్కునొకనిఁ
జెట్టఁబట్ట నొప్పుటయన ♦ వట్టిమాట!

మాన—అబ్బా ! ఏమిపౌరుషము ? ఏమిమానాభిమానములు? ఏమికీర్తిపత్రిత్వలు ?

గీ. దొమ్మిగావచ్చి కోటల ♦ దోచిమాన
వతులమని విఱ్ఱవీగెదు ♦ వారినెల్ల
బలిమిఁగొంపోవునప్పుడీ ♦ వాక్కులెటకుఁ
బోవునో! వారిశౌర్యాగ్ని ♦ ముందునబల!

తురుష్కులు మునుపు అటులొనర్చినవారుగారా ? వారిప్రతాపానలము ముందుమనరసపుత్రవీరులు తాళగల్గిరా ?

రూపా—జయాపజయములు దైవాధీనములు. గెలిచినవారు గెలిచిరి. ఓడినవారోడిరి. అఁడువారలెవ్వరును తురుష్కులకులొంగ

లేదు. తమ కవమానము సంభవింపనున్న సమయంబునఁ దమప్రాణ
ములఁ దామే కాపాడుకొనిరి. ఇంత యేల ?

గీ. ఎవ్వరునుగాని మీవలె ♦ యిట్టిపాడు
జూద మొకటి వాడుచుఁ దమ ♦ సోదరి నీదు
రుష్కునకు నంటఁగట్టఁగో ♦ రంగ లేదు
పితికి వందలతో లెను ♦ దిరుగ లేదు.

మాన — రూపావతీ! నా ప్రశ్నమున కిదియేనా సమాధానము ?

రూపా — నన్నేమి చెప్పుమనియెందురు ? ఈ దురంత కార్యము నా పెఱుఁ దెలిపి శాశ్వతముగఁ దలంచుకొని గృశించు పరాభవమును బొందుమని యెదరా? అత్తమామల చేత గెంటించుకొమ్మందురా ? వంశమునందీగొప్ప కళంకమును బెట్టుమందురా ? మతధర్మంబులమితి మీఱుమందురా? ఇఁక పరంబులకుఁ జెడుమందురా ? నలువురిచే ప్రేలుఁ బెట్టి చూపించుకొమ్మందురా ?

మాన — నేను నీ ప్రాణేశ్వరుఁడను. నా మాట వినవలదా? పతి యాజ్ఞ దాటవచ్చునా?

రూపా — మీ సంభాషణమంతటితో గట్టిపెట్టుఁడు. ఎవ్వారైన విన్న నవ్వుదురు. నేను మీ సతినైనందులకు నా ధర్మముల నేమియు మీఱుట లేదు. ముందుగూడ మీఱను. ఇయ్యది పతి చెప్పవలసిన కార్యముగాదు. సతులొనర్చితీరవలెననెడి విధాయకమునుగాదు. ఇట్టి హేయసంభాషణ మొనర్చుచున్న మీ చెంత నిలుచుచుంటకే నా మనంబంగీకరింపకున్నప్పుడు సతిధర్మములమాట నేలఁ దలపెట్టెదరు ? సతి యొక్క లక్షణము లేవియో మీకు గుర్తున్నదా! అవివాహితను, సాటిరాట్కుమారీమణిని అందునను నాకు బిడ్డను నాభర్తకాఁగ జూదమునందొడ్డి పెట్టెనని యాబిడను గైకొనివచ్చి మీ చేతులలోఁ బెట్టి మీ

ద్వారా తురుష్కునివశము చేయుటయేనా సతియొక్కలక్షణము ? ఇఁక నేని మీపట్టునువదలి సన్మార్గావలంబకులై కీర్తికాంతను జేబట్టుఁడు. మఱియు.

గీ. రాజ్యరమవృద్ధిఁ జేయుఁడు ♦ రాజపుత్ర
వంశమునకుఁ గీర్తిఁ గడింప ♦ పాటుపడుఁడు
మ్లేచ్ఛజాతికిసెలవిడి ♦ స్వేచ్ఛఁగనుఁడు
హాయిగా సౌఖ్యములఁ బొందు ♦ చలరుఁడయ్య!

అంతియేగాని యిదియేమిపని ? పూర్వమెవరో భీరులైరని, తురుష్కజాతితో వైరంబువలదనియేమో ధర్మధనమ్ముల నేకముపుబెట్టుచు నన్నుఁ గూడపాపమున భాగంబుఁబంచుకొమ్మందురేల? ఆభీరులైనవారుమాత్రమిట్టి దుర్నయములకుఁ బాల్పడిరో ? వారిచరిత్రముల మాత్రము మనము వహింపలేరా ?

గీ. ఉదయసింహుఁడంతటివాఁడు ♦ యుద్ధమునకు
జంకి ధనమిచ్చి వారితో ♦ సంధిఁజేయు
యత్నములొనర్చె నేగాని ♦ యుద్ధమైన
పనిని నొనరింపఁగా బూను ♦ కొనెనె చెపుమ!

హాస—ఛీ! ఊరకొన్నకొలఁదియు నీవాగాడంబరము హెచ్చుచున్నయది. ఓరూపావతీ! నేను సర్దార్బును వశముచేసికొనలేక నిన్ను బ్రతిమాలుకొనుచుంటినని తలంచితివి కాఁబోలు. ఏమో సామముచేతఁగార్యము చక్కఁబడనాయని యీవిధానమవలంబింప నీచాతుర్యమంతయుఁ గనఁబఱచితివి. చాలుఁ జాలు. ఇందులకుఁ దగినవిధము నాకడలేకపోలేదు. తురుష్కులేవచ్చి కావలసిన కార్యక్రమమంతయు నడిపించినపుడే మీమొగములపై గుడ్డలు వైచుకొందురులే?

రూపా—కానిండు. దైవనిర్మాణమెట్లుండిన నట్లులనే జరుగును. అంతియేగాని యీపాతక కార్యము నేనొనర్పఁజాలను. అయశఖ్యాతి నేనుపొందఁజాలను.

మాన—నీవీకార్యమున నడుగుపెట్టనేవలదు. నేనేసర్వంబును నిర్వహించెదను లెమ్ము?

(అని వెడలుచున్నాఁడు)

రూపా—ఇప్పుడీతండెచ్చోటికి కేఁగఁగలఁడు! (ఆలోచించి) తురుష్కజాతితో గూడి కుట్రలఁబన్నుఁగాఁ గోలు! అహా! సర్దార్బా! నీకట్టి దశరానున్నది. కాసిమ్ము- ఆయుత్తమకాంతాలలామ కేయాపదరాకుండ శక్తివంచనలేని సహాయమొనర్చెదనుగాక?

(నిష్క్రమించుచున్నది)

---

తృతీయరంగము



—♦కేకిమహారాజును; చంద్రావతియు;♦—

కేకి—చంద్రావతీ! చూచితివా! కుమారుఁడువ్రాసిన యీయుత్తరమును? (అనియుత్తరమిచ్చును)

చంద్రా—(చదివి) నాథా! చదివితిని. (తనలో) హా! మానసింహా! ఎంతవాఁడవైతివి. కన్నకడుపగుటచే నీచెయిదంబులకు లోలోపలనే మ్రగ్గుచు నెంతదాఁక యూరకున్నను చివఱకీమహాఘోరమును గూడ నొనర్చితివా? తండ్రీ! పవిత్రవంతమైయులరారు రజపుత్రజాతి కెట్టికళంకమాపాదించితివిరా? కులమునకు వేఱుపురువై పోతివే? ఇది మనికిమాలిన కార్యముగదా? స్వసోదరీమణిని తురుష్కుని వశమొనర్చుట మహాఘోరముగదా? యన్న యాలోచన మేమియు లేకపోయి

నదా? కాదుకా! నీచదువులన్నియు నీవిధముగాఁ బరిణమించినవా? నీశౌర్యధైర్య పరాక్రమములన్నియు నీవిధముగా గంగలోఁగలిపితివా?

రూపా—(ప్రవేశించును)

చంద్రా—రూపావతీ! చూచితివే! నీపెనిమిటియుత్తరమునుఁ (అని యిచ్చును)

రూపా—(చదివి) ఈవిషయము నాకు నిన్ననే తెలిసినది. నేనా యన ననేకవిధంబుల మందలించి చూచితిని, కాని ప్రయోజనము లేకపోయెను. ఇప్పుడిందులకుఁ గర్తవ్యమేమి యూహించితిరి ?

కేకి—అమ్మా! రూపావతీ! వయసునఁజిన్నదానవైనను బుద్ధికి నీతోఁడసమానమైనవారము గాము. నీపురాకృతపావకర్మఫలంబున నీకీభర్త దొరికినాఁడు. వాఁడెట్టి యవినీతుఁడైనను నీసుగుణసంపదనే చూచుకొని మేమానందవారినిధి నోలలాఁడుచున్నారము. ఇపుడు గర్త్యంతరముఁగూడ నీవేయూహించి మకొక్కదరిఁజేర్పుము. రూపావతీ!

గీ॥ కొమరుఁడిటుచేసినందుకు ♦ గోపగించి;
తగిన శిక్షవిధించుట ♦ ధర్మమగునొ?
వానిలేఖననుసరించి ♦ వీరసుపుత్రి
నిపుడు మ్లేచ్ఛునిచేతిలో ♦ నిడఁగనగునొ?
యేదియో యొండు వేనిర్ణ యింపుమమ్మ॥

రూపా—మామగారూ! ఇందులకు గర్తవ్యమును నేనాయూ హింపందగినదానను? పెద్దలుమీరు, చిన్నదానను నేను- అదియుఁగాక- మీప్రశ్నంబునకు నేనేమని సమాధానమీయఁగలను?

గీ॥ చేసికొనినభర్తను గొప్ప ♦ శిక్ష వేసి!
వెడలగొట్టుమటంచును ♦ వేడుకొనన?
విమలచరితను దీనుక ♦ వెళ్ల మ్లేచ్ఛు
వశముఁజేయుమటంచును ♦ బలుకవలెన?॥

మామగారూ! ఇదమిత్థమని వచింపసమర్థురాలనుగాను. దీనికిమంత్రిగారైన సమాధానమీయవలయును. లేదా! మనసర్దార్బాయైనఁ దగిన యోజనఁ జేయవలయును.

కేకి—అమ్మా! రూపావతీ! నీయోచన యుక్తియుక్తముగానున్నది. ప్రియసఖీ! చంద్రావతీ! నీవుపోయి అమ్మాయినిదీసికొనిరమ్మా?

చంద్ర—చిత్తము. (అని నిష్క్రమించి సర్దార్బాను తోడ్కొనివచ్చును)

సర్ద—నాయనగారూ!నమస్కారములు. (అని దీనవదనముతో నిలువఁబడును)

కేకి—అమ్మా!నీముఖము కళావిహీనమై యున్నదేమమ్మా?

సర్ద—ఏమియును లేదు. మొన్న మేము శివసందర్శనార్థమై పోయినపుడు గలిగిన యుపశకునమే నన్ను భీతచిత్తురాలినిగావించినది. అప్పటినుండి యేమో నామనంబొకవిధంబుగానున్నది.

కేకి—అమ్మా! అంతమాత్రమునకే భీతిఁజెందవలయునమ్మా?

రూపా—ముద్దులా! నీవీయుత్తరమునుజదివియిందులకుఁగర్తవ్యము నిర్ణయింపవలసియున్నది. (అనియిచ్చును.)

సర్ద—(చదివి) వదినే! నేనిందులకుఁ గర్తవ్యమూహింపవలయునా? తల్లిదండ్రులారా! నేనుపాపాత్మురాలను. కావుననే నాపూలమునఁ దమకిట్టికష్టములు సంప్రాప్తమగుచున్నవి. ఛీ! ఛీ! ఈ పాడుజన్మను ధరించుటకంటెఁ జచ్చుటయే మేలు. (అని బాకు నెత్తి పొడుచుకొనఁబోవ)

రూపా—(అడ్డువచ్చి బాకులాగికొని) సర్దార్బా! ఇంతతొందరయేలనమ్మా! నీవు ప్రాణములఁబోగొట్టుకొనినంతమాత్రముననే నాభర్తగుణవంతుఁడగునా? తనదురాచారములుమానునా?ఆయనవ్రవర్త

నమునకు మీమందఱమును ప్రాణములను విడవలసినవారమే. మీయన్నగారుత్తరము వ్రాసినంతమాత్రముననే నిన్ను మీతండ్రిగారు వెంటఁ గొనిపోయి యాకుటిలుని వశముఁ జేయుదురన్నా? నీవేమో తెలివి తేటలు గలదానవని నీతోడ యోచించినందుల కిదియటమ్మా ఫలితము? మానాభిమానములు గలవారు, రజపుత్రవంశోద్భవులము గదా యున్న పౌరుషమున్నవారు, మనపూర్వీకుల గౌరవప్రతిష్ఠలు గాపాడుకొనవలెననెడి యుత్సాహమున్నవారు, తనప్రాణ, మాన, ధనంబులు శోణితరూపంబుగా ధారవోసియైన వారు తురుష్కుని యుబలాటమునకుఁ బ్రతిక్రియఁగావింతురుగాని వానికి జంకి, నీయన్నగారి యుత్తరమున ననుసరింతురే? ఈమాత్రపాలోచనము నీకు లేకపోయెనమ్మా? మనమిట్టి సమయంబున ధైర్యమవలంబించి ఆమ్లేచ్ఛునకుఁ దగుపరాభవముఁ గావించవలయును. మొగముపై గుడ్డవైచుకొని పలాయనంబగునటులఁ జేయవలయును. మనకాలపువారిలో సెబాసనిపించుకొనవలయును. అంతియేగాని యిది వెఱ్ఱియాలోచన కాదమ్మా?

సర్ద — అట్లయిన నోపదినెగారూ! మీయాజ్ఞ ననువర్తింతును. ఇట్లు చేయుదము. (అని చెవిలో నేదియో చెప్పి) నాయనగారూ! మీకు అన్నగారియుత్తరమునకుఁ బ్రత్యుత్తరముగా నీయుత్తరమందినదనియు, నీకోరికప్రకారము నారహిముఖానునకు మనసర్ద్యా నిచ్చుటకు సంసిద్ధుఁడనై యుంటిననియు, నిందులకు మనసర్ద్యాగూడ నంగీకరించెననియు నేటిరాత్రి పదిగంటలగునరికి దుర్గాలయముకడ మనసర్ద్యా సిద్ధముగ నుండుననియు, నాతఁడువచ్చి తీసికొనిపోవచ్చుననియు" వ్రాసిపంపుఁడు. పదఁపడి కర్తవ్యము మనయూహించుకొనవచ్చును.

కేకి — తల్లీ! సర్ద్యా! నీయాలోచనమేదియో నాకువినిపింపుమమ్మా?

సర్దా—నాన్న గారూ! నాయాలోచనమునకేమున్నదండీ! నేనును రూపావతియుఁ బదిమంది సైనికులతోఁ గూడఁబోయి దుర్గాలయము కడ వేచియుందుము. నన్నుఁగొనిపోవుటకై రహిమత్ఖానుఁడును వాని కుటుంబదారులును రాఁగలరు. వారినందఱ బంధించి మీాసముఖమున నిలువఁబెట్టెంతుము. అప్పుడుమీాచిత్తానుసారముగ వారికిఁ దగినదండనమునువిధించవచ్చును. అమ్మా! ఏమందువు?

చంద్రా—తల్లీ! నేనేమందునమ్మా! మనమాదుర్మార్గునకిప్రతిక్రియఁ గావింపవలసినదే! కాని యాదుర్వారముగదా యని సందేహించుచుంటిని.

సర్దా—అమ్మా! అనుపారమైనచో భయమటమ్మా?

ఆ॥వె॥ చేత శూరులుండ శివ్రుఁడెగాదుహరియె
గాదు కాలయముఁడె గాదువారి
యుబ్బులైనఁగాని పాదలెత్తి పారరే?
మాటలేల్కా! యొరులు మమ్ముగెలువ?

గీ॥ కంఠగతప్రాణముల్నంత కాలమెపుడు
మమ్ము నృపశియింపఁజాలుదై ర్యమ్మగలుగ
వారలుండరు రసపుత్ర వంశపౌరు
షంబుఁజపిజూడఁదగు సాహ సంబుగనరు!

నాయనగారూ! ఆలసింపనేల? తామిప్పుడే నేను విన్నవించినటుల లేఖ వ్రాసి యన్నగారి కడకుఁబంపుఁడు; (తనలో) అన్నా! మానసింహా!

గీ॥ పుట్టితివి యొక్కతల్లికడుపునను యొక్క
చోటఁబెరిఁగితి మొకచోట నాటలాడి
కొంటిమట్టిప్రేమము నెల్ల మంటపాలు

చేసి కన్నుకను మ్లేచ్ఛుని ♦ చేతఁ బెట్టఁ
దలఁతువే యింత కఠినంబుఁ ♦ దలఁచి నీవు!

ఓమద్యరసమా!

గీ॥ వావివరుసఁ దలంపని ♦ వానిఁ గరణిఁ
జేసి, ద్యూతంబునకుఁ దార్చి ♦ పెద్దతనము
జా పుకొంటివి యియ్యది ♦ పాపమంచుఁ
దలఁపవైతివి నీతిని ♦ ద్రోలఁగి నీవు.

గీ. సర్వకాలము నిన్నుఁ బో ♦ షణము జేయు
మ్లేచ్ఛజాతి వంచలనుండి ♦ తొలఁగ లేక
హైందవుల యొద్దనేని సా ♦ ఖ్యంబు వడఁగ
సాహసించితొ మద్యర ♦ సంబ నీవు.

కేశి—అమ్మా! అట్లనే పంపెదను. ఈవిషయమును మనమం
త్రిగారగు విక్రమసింహునకుఁ గూడఁ దెల్పుట యుక్తము గాన వాని
నిప్పుడే రావించి యట్లొనర్తును. నేనింక దర్బారునకుఁ బోయెదను.

(అని నిష్క్రమించుచున్నాఁడు)

సర్ద—రూపావతీ! నీవు వాతోఁ గూడ వచ్చెదవా?

రూపా—ఏల రాకుందు నమ్మా?

సర్ద—అట్లయినచో మనమింకఁ బ్రియాణసన్నాహమునం
దవలదా?

రూపా—అవశ్యము గనుండవలయును.

చంద్రా—తల్లీ! సర్దార్బా! కోడలా! రూపావతీ! మీరిద్దఱు
ను జిన్నవాండ్లే. కడుజాగరూకతఁ గలిగి మెలంగవలయును సుండీ?

రూపా—అత్తగారూ! అందునఁ గూర్చి మీ రెక్కువగాఁ
జెప్పవలయునా? మనమింకఁ బోవుదమా?

చంద్రా—మంచిది.

(అందఱు నిష్క్రమించుచున్నారు)




## తృతీయాంకము.

---

(కేకిమహారాజు, విక్రమసింహుఁడును, ప్రవేశము)

కేకి—ఓరీ! ఎవఁడురా! అక్కడ!

కంచు—(ప్రవేశించి) దేవా! ఆజ్ఞ.

కేకి—బంధితులైయున్న యాదుర్మార్గుల నందఱినిఁ బ్రవేశఁ బెట్టుము?

కంచు—చిత్తము (అని వెడలి రహిమత్ఖానుని వజీరుని, మానసింహుని, విశ్వనాథుని వెంట నిడుకొని వచ్చుచున్నాఁడు)

కేకి—మంత్రిపుంగవా! అంతఃపుర ద్రోహులకు శిక్ష శిరశ్ఛేదనమే గాన నటులొనర్ప నుత్తరు వొసంగుచున్నాఁడను. కాన వీరితలలు తీసివేయునటులఁ దలవరుల కుత్తరువులిచ్చి పంపివేయుఁడు)

రూపా—(దివాలునఁ బ్రవేశించి) మామగారూ!(కాళ్లపైఁబడి.

గీ. ప్రేముడిని నాకుఁ బతిభిక్ష ♦ పెట్టిపనుపు
కుంకుమను నిల్పుమని వేడి ♦ కొందుమిమ్ము
కన్నసుతుని సంతలు జేయఁ ♦ గతినులంచు
పలువురనుకొన నవ్వాల ♦ పాలుగారె!

కేకి—అమ్మా! రూపావతీ! నీవేల సడ్డువచ్చెదవమ్మా! వీఁడు నాకొమరుఁడా? నీభర్తయా? రసపుత్రుఁడా వీఁడు? ఆవిశ్వాసమే వీఁడికున్నచో, ఆప్రేమా వాత్సల్యము లే వీఁడికున్నచో, వీఁడినాళములయం

దు రసపుత్రి నీరక్తమే ప్రవహించుచున్నచో, నీకెడికి మానాభిమా
నములే యున్నచో, తనస్వసోదరీమణిని యీపాచ్ఛాధమునితో జూద
మాడి యోడిపోవునే? ఈదుర్మార్గుడు నాకుఁ గొడుకని చెప్పుకొనిన
ను సిగ్గుగా నున్నయది. ఈరసపుత్ర జాతియొందిప్పటివఱకుఁ ద్రోహు
లెత్తుటుండిరా? జూదరులైనవారుండిరా? తమకులధర్మముల మీతిమీ
తిన వారుండిరా? ఇట్టి కొడుకుండిననేమి? లేకున్ననేమి? అమ్మా!
రూపావతీ! నీకుసుపుత్రుకుమును నిల్పుట వంశప్రతిష్ఠను నిల్పుటకన్న
నెక్కువదిగాదు. ఎంత కాలము మన మీదుర్మార్గు నదుపాజ్ఞలు లేక
మెలంగనిచ్చెదము? కొట్టెడియీడా? తిట్టెడియీడా? మానమును గడ్డ
మును వచ్చినవే. ఐదు వత్సరములకొడుకుండడనే? ఏలబుద్ధి లేక పోయె
ను? తల్లీ! నీకేగాటును రానీయను. నీవే నాకొడుకువనుకొందును.
ఈసామ్రాజ్యమునంతటిని నేడే నీకొమరునకిచ్చి వేసెదను. మఱియు
నీవేమి కోరినపని నిచ్చెదను. అంతియేగాని యీహీనుని, యీఛండా
లుని, యీకిరాతకుని, యీవంశనాశకుని క్షమింపుమని నన్నెన్నండు
ను గోరకుము. వీనిని క్షమించుటకన్న ప్రాణములను బ్రక్కలోఁ
బరుండఁ బెట్టుకొనుటయేనుమా ?

రూపా—మామగారూ! ఈయనిన మాటలు చాలవా? ఇంత
కన్న మానాభిమానములు గల వారికి వేరుశిక్షలు గావలయునా? గాన
నాప్రార్థన నాలించి రక్షించఁగ నందులకు వేడుకొనెద.

విశ్వ—(తనలో) ఎంత చెడ్డా పెళ్ళాం గనుక అభిమానమట్లా
యేడిపిస్తుంది. నన్నుఁ జూచి జాలిపడే వారెవరు? నన్ను రక్షింపుమని
చెప్పేవారెవరు? (మానసింహునితో రహస్యముగా) మిత్రమా! నీరొ
ట్టె నేతిలో పడుతూవుంది. నాగతేమి?

మా—(కనుసన్నఁ జేయుచు) ఉండవోయ్! అంతవఱకురాని?

విశ్వ—సరే. సరే. సద్భావము. మొదటినుండియు నిన్నే

నమ్మికొని యున్నాను. గురువును. నన్నన్యాయముఁ జేయ వద్దనుచున్నా?

కేకి.—ఏమి రా? మ్లేచ్ఛాధమా! వారికి కింగితము లేకపోయిన ను నీవైనఁ జెప్పకపోతివా? ఇట్టి హేయకార్యము లొనర్ప సమర్థుఁడ వనియే గాబోలు సుల్తాను వారు నిన్ను వజీరుని గావించినది. నీకు సర్ద ర్బాను వివాహమాడవలెనని యే యున్నదా? ఉరికిఁ బొల్పుడుదయుని యున్నదా ?

రహి.—మహారాజా వార్కీ నలాంగొట్టీ సెప్తాయ్. మా పానా ల్యాడికీ చెమించుకొన్నారూ అంటే మాదీ చెంతల్యాడ్కీ హిట్లాబుద్ధి సెప్పి హల్లాకటాచ్చమ్ తల్సుకొని యింటికి పోతామ్. మాకీ చెమిం న్యాగా మహారాజ్. మీాఖానూ౽త్తల్యార్కీ మాకీ నలాం సెప్తాయ్. మాకీ పెల్లి సానన్ రాజా!

వజీ.—మహారాజాకీ హైసాబోలో?

మంత్రి.—రాజేంద్రా! స్థితిగతులిట్లున్నవి

కేకి.—నిక్రమసింహా! నేనును నదియే యోజించుచుంటిని. మా పావతికొక కీతి నన్నరించ లేకుంటిని. ఒక్కరి సేవదలిన చోఁ గన్న కుమారుఁ డంత యవినీతుఁడైనను వారి యెడఁ బక్షపాతము వహించి వదలిపెట్టి మిగతవారిని శిక్షించితినని గేలి సేతురు ?

మాన.—మానవనే రోతెండ్రి: నేను గావించిన మహాపచా రమునకు- మాయప్పవిరత్నమునకు, బశ్చాత్తాప పడుచుంటిని. నాకీయ వమానము చాలును. వేఱేతలఁ దీయించవలయునా? ఈముప్పురును నిర్దోషులు, ఈవిషయమునదోషిని నేను గాని వీరుగారు. కోరినరీతిఁ బం డెమున కొప్పుకొనిన నేను శిక్షింపఁ బడవలయునుగాని వీరు శిక్షార్హు లుగారు. మాసఁదమకటాక్షమును జూపింపఁదలఁచిన మానలుప్పురిపై నఁ జూపించుఁడు. లేనిచో వీరిముప్పురిపైననైనఁ జూపించి తలవరులచేత

వారల నరికించుటకంటె మీరు మీచేతులతోడనే నాకంఠము నుత్త
రించుఁడు.

విశ్వ—(రహస్యముగా) బలే టోపీగొట్టావోయ్. ఇదీ యెత్తు
పైయెత్తు మళ్లీ ధ్వజమెత్తి నామన్నమాటే.

మాన—తొందరపడకోయి. (అని రహస్యముగాఁ బ్రత్యుత్త
రమిచ్చుచున్నాఁడు)

విక్రి—రాజేంద్రా! తమ యాలోచనము బాగుగనే యున్నది.
వీరి నిప్పట్టునవదలుటయే యుత్తమమైనపద్ధతి.

కేకి—మీరొనర్చినది మహోపచారమైనను పశ్చాత్తప్త హృద
యులైనందున విడిచినారము. ఇఁక జాగరూకులై మెలంగుఁడు. పొండు.

(దోషులు నలుగురును నిష్క్రమించుచున్నారు)

రూపా—మామగారూ! తమ యపూర్వోపకారమునకీదా
సురాలివందనశతములఁ గైకొనుఁడు?

కేకి—అమ్మా! రూపావతీ! ఈవిషయమునందు నీమాటవినకఁ
దప్పినదిగాదు. నాకెంతమాత్ర మీదుర్మార్గుల వదలవలయునను తలం
పే లేదు.

విక్రి—దేవా? దేవరవారితో నొక విషయము విన్నవించుకొనె
దను గ్రహింపుఁడు. మానసింహుఁడు మిమ్ముల నామ్లేచ్ఛుని సహవాస
ముఁ జేయకమానఁడు. ఒకవేళ నతఁడూరకుండిన నారహిమత్ఖానుఁ
డూరకుండ నిచ్చువాఁడుగాఁడు, ఏసమయమునకే యాపదఁదెచ్చి నెత్తి
పైఁ బెట్టువాఁడో మనము మెలకువఁ గలిగి యుండుటమంచిది.

రూపా—అంత ప్రమాదము, రానేగూడదు, ఒకవేళ వచ్చునే
చూడుఁడు!

గీ. ఆడువారమైనను గాని ♦ యట్టిసమయ
మబ్బినప్పుడు వెనుదీయ ♦ మయ్యమేము

శక్తి గొలఁది మాసాహస • చర్యఁ జూపి
శాత్రవుల త్రుళ్లడంచ మే • సంగరమున

భర్త గారింక మీఁదనట్టి సాహసమునకుఁ బూనుకొనరని నాకొక వెఱ్ఱినమ్మకము. ;మఱల నీయవివేకమునకే పాల్పడినచో నీతడవ నేను మాత్రమూరకుందునా? అప్పుడేని నాసాహసమును మీరు మెచ్చుకొనకుందురా?

కేశ—తల్లీ! నిన్ను మెచ్చుకొనని దెవ్వడమ్మా! నీహృదయమునే నెఱుంగనిదియా! అంతఃపురముమాత్రము జాగ్రత్తగా జూచుచుండు భారమునీది. మంత్రిపుంగవా? మనమింకఁ బోవుదమా?

(అందఱు నిష్క్రమింతురు)

(ద్వితీయరంగము.)

(సర్దర్బా నిదురించుచుండును)

రూపా—(త్వరితగతిఁ బ్రవేశించి) సర్దర్బా! సర్దర్బా! నిదురించుచుంటివేమమ్మా! (నెమ్మదిగా దగ్గఱకుఁబోయి) సర్దర్బా! సర్దర్బా! (కొట్టిలేపుచు) లెమ్మా లెమ్మా?

సర్ద—(కన్నుల నలుపుకొనుచు లేచి) ఎవరువారు? వదినే! నీవేనా! ఏమమ్మా! ఇంతఅర్ధరాత్రి లేపుచుంటివి?

రూపా—అర్ధరాత్రియేమి! లెమ్మా! లెమ్మా! తురుష్కసైన్యము లోనఁ బ్రవేశించుచున్నది. బాకునుదీసికొనుము. ఆగుమ్మముకడ సిద్ధముగనుండుము. నేనీగుమ్మముకడ సిద్ధముగనుండెదను.

సర్ద—తురుష్కసైన్యమే?

రూపా—కేకలవేయకుము. నెమ్మదిగమాటలాడుము. ఎవ్వరై

నసునరే ముందు వక్షస్థలమందుఁ బొడువ్రము. బాకు విషపూరితమై యున్నదికదా?

సర్ద—బాకు విషమిళితమైయే యున్నది.

రూపా—లెమ్ము. లెమ్ము. సమీపించుచున్నారు. సందడి వినఁబడుచున్నది.

(చెఱియొక ద్వారముకడఁ గావలిఁగాయుచున్నారు)

(నలువురుతురుష్కులు రాగఁ వారిని బాకులతోఁ బొడువఁగూలుచున్నారు.)

రూపా—సర్దార్బా! మఱచితిని. లోనఁ గుమారుఁడొంటరిగఁ బరున్నవాఁడు. వానికేయాపద రాకుండ నీవుపోయి కాపాడుచుండుము? నేనీరెండు ద్వారములను గాపాడుచుండెదను ?

సర్ద—మంచిది (అని నిష్క్రమించుచున్నది)

రూపా—(పహరా చెలాయించుచుండ మానసింహుఁడు ప్రవేశించి లోన కడుగుపెట్టయత్నించును)

రూపా—(పొడవఁబోవ)

మాన—ఎవరినిపొడిచెదవు! రూపావతీ!

రూపా—ఓహో! తమరేనా! ఎక్కడికీహడావుడిప్రయాణము ?

మాన—లోపలకు.

రూపా—ఎందులకు ?

మాన—సర్దార్బాకొఱకు.

రూపా—సర్దార్బాతోడ నీయర్ధరాత్రియందేమిపనియున్నది ?

మాన—నీప్రశ్నలకుఁ దగుసమాధాన మీయనవసరము లేదు. అడ్డము లెమ్ము?

రూపా—అట్లుచేయ వీలు లేదు.

మాన — వీలు లేదా! (అని ఖడ్గమును దూసి పై కెత్తుచున్నాఁడు)

రూపా — ఆపని మీచేతిమీఁదుగ నొనర్చియే లోఁబ్రవేశింపుఁడు. అంతియేగాని యీరూపావతి జీవించియుండఁగా లోనికిఁబోనీయదు.

మాన — రూపావతీ! ప్రాణముల నేలఁగోల్పోయెదవు? నేను నాప్రతిజ్ఞ దాటువాఁడనుగాను, రహిమత్ఖానునకు సర్వస్వమునొప్పగించియే తీరవలయును. వృధాగా నడ్డమేల వచ్చెదవు? ఏలఁజెడిపోయెదవు? నీవు నాకర్థాంగలక్ష్మివగుటచే నింతగాఁ జెప్పవలసివచ్చినది.

రూపా — అవును. నిజమే మీరు నాకుపతులగుటచేతనే యెత్తిన బాకును క్రిందకు దింపవలసివచ్చినది. లేకున్నచో నీవఱకే యొకరికొకరిసంబంధము లేకుండెడిది. అర్ధాంగలక్ష్మినిగదా? మీరు పూనికొనినదురుద్యోగము పాతకహేతువైనదిగదా? వినయపూర్వకముగ మందలించితినిగదా? కావలసిన తలవంపులన్నియు నైనవిగదా? నలువురినోళ్లలోఁ బడితిమిగదా? ఇంతటితోనైన నాపూనికను విరమించుకొనక దురుష్కులకుఁ దగుసలహాలనొసంగి యింతఘోరకార్యమునకుఁ దెగింతుగా? కుత్తుక నుత్తరింపుమని మీతండ్రిగా రాజ్ఞనొసంగినపుడు వరువెత్తుకొనివచ్చి "మామగారూ! పతిభిక్షఁ బెట్టుఁడు. నన్నుగరుణించుఁడు. వారికమీఁదనీ హేయకార్యమును విరమించుకొందుర"ని ప్రాధేయఁబడ వారు నామాటలవిశ్వసించి మిమ్ములవిడుదలఁజేసినందులకుఁ దాము చూపినకృతజ్ఞత యీయాయిది? ఆహా! ఏమి మీమతాభిమానము? తలవంపులు పడలేక, యీయమానుషకృత్యంబులఁ గంటితోఁ జూడలేక, మీవిపరీత చెయ్దములను సహింపలేక రసపుత్రకులంబునకుఁగళంకము దూర్పలేక, పూర్వులపక్కని విడలేక, మానాభిమానములఁద్యజించలేక, యీమహాఘోరకార్యమున భాగమును బంచుకొనలేక, సాటిరాజుల

వారిని నాచేతులతో మీవశముచేయలేక, మీపాపపుహస్తంబున నసువులఁ బాయలేక, వీటినన్నిఁటిని మించినఘోరదుర్గతులు నన్నావరించినను నాత్మహత్యయే మంచిదని నిశ్చయించుకొని యిదే యీనావిష పూరితమగు బాకుతోఁ బొడుచుకొని ప్రాణముల వదలుచున్నదాన. మిమ్ముల మఱియొకతూరి హెచ్చరించుదాన. నాయావశ్యకతయెమీకున్నచో, నాతోఁగూడ మఱికొన్నిదినంబులు సుఖంపవలెననెడి యభిలాషయెమీకున్నచో, నాపైనిమీకు ప్రేమావాత్సల్యములేయున్నచో, నామాటయేమీరువినఁదలఁచుకొన్నచో మీరొనర్చుచున్నదిదుర్వ్యాపారముగదాయనెడి పశ్చాత్తాపముమీకుగల్గినచో, మీనాళములయందు రసపుత్రవీరరక్తమేప్రవహించుచున్నచో, నాక్రూరమ్లేచ్ఛులుమన రసపుత్రజాతికెంతదగ్గఱిచుట్టములో యోజించి వారిదుర్ణయములనే స్మరించుకొని యిప్పుడేని జాగ్రతపడినచో, మీరూపావతి మీకుదక్కఁగలదు. మీరు నామాటవినక నాయాత్మహత్యకే మీరంగీకరించినచో నామరణానంతరమే మీకు స్వేచ్ఛచిక్కఁగలదు. అంతియేగాని.

గీ. బాకునాచేత నున్నంత । వఱకు నాదు
ప్రాణములు నిల్చియున్నంత । వఱకు మీకుఁ
గాని యాపురారికిగాని । లోనికరుగ
వలనువడునని తలఁచుట । వట్టిభ్రాంతి॥

గీ. కేకిమహారాజకూతురు । మీకుఁదక్క-
వలెనటన్న రూపావతి । ప్రాణములనుఁ
దీసియా మీఁద మీస్వేచ్ఛఁ । దిరుగుఁడయ్య
విజయలక్ష్మిని గొనుఁడయ్య । వెడలుఁడయ్య॥

మాన—వినదా! నియుపన్యాసము పూర్తియైనదా? ఇంకేమైన మిగిలినదా? ఓరూపావతీ! నామనోభిప్రాయమును నీకుస్పష్టముగాఁ దెలిపెద నాకర్ణింపుము.

గీ. ఆత్మహత్యకుఁ బూనితి ♦ ననుచు వెఱువ
సోదరీమణియని దయ ♦ జూడనామె
వారివశ నీదుమాటల ♦ ననలెనరకుఁ
జేయ ద్యూతము నందోడి ♦ పోయినట్టి
కాంతనట్టులైనఁ గొనిపోయి ♦ ఖానునకు స
మర్పణమొనర్పవలె దీని ♦ నావఁజాల!

గీ. పతివనెడిసత్యమున నను ♦ వదలినపరె
ఖడ్గమునకు శీర్షంబునుఁ ♦ గానుకనిడి
స్వేచ్ఛనిచ్చినపరె మొటు ♦ చేయుఁదలఁచి
నావు శిక్షింప యటులెరయొ ♦ సర్చుమా బలా!

రూపా—ఆర్యా! మీమనోభిప్రాయమిదియా? సరియే; మీకును నాకును ఋణము దీఱిపోవుచుండ నేనేమి చేయఁగల్గుదును? మీకు స్వేచ్ఛనీయ లేదనియు మీప్రాణముల నిష్కారణముగ నేనుదీసి తిననియు నపవాదమా నాకేల? ఈమహాపచారముల నేనుడిలో వేసి కొనివంశమునకు నేనుగళంకము దేనేల? ఎవరికర్మమును వారనుభవించి తీరవలసినదని విధిస్పష్టముగ దనవ్రాతచేఁ దెలుపుచుండ దానిని నెవ్వరుదప్పింపఁగలరు. నేను మీకుఁ జెప్పవలసిన దేమియు లేదు. నాచుట్టపక్కము లెవ్వరికినిఁ జెప్పవలసినదేమియు లేదు. ఇదిగో నాబాకే యీలోకమునకు నన్నుఁ గూర్చినవార్తలన్నియుఁ దెలుపఁగలదు. హా! సర్దార్జీ! నిన్ను విడచి యేగుచున్నాను. హరహర మహాదేవ! హరమహాదేవ! (అని బాకుతోఁ బొడిచికొని ప్రాణముల విడుచుచున్నది)

మాన—వదలిపోయినది. శనివదలిపోయినది. కావలసినంత స్వేచ్ఛ చిక్కినది. సర్దార్జీ! ఎందుఁ బోయెదవు? ఎందుఁ బోయెదవు? (అని లోనికిఁ బరువెత్తుచు, సైనికులారా! రండు. రండు. ఇదియె నమ

యము (అని నిష్క్రమించి సర్దర్బాను సంకెళ్ళువైచి తనకుమారుని చేతులతో నెత్తుకొని ప్రవేశించుచున్నాఁడు)

సర్ద—అన్నా! ఇట్టి యమానుషమైన కార్యమొనర్చుటకు నీచేతు లెట్లాడినవి? నేను నీచెల్లెలినిగానా? నీవు చేతులమీఁదుగ నన్ను బెంచలేదా? నన్నీవిధముగ బంధించుట నీకు న్యాయమగునా?

మాన—ఇప్పుడు న్యాయాన్యాయ విచారణ మెవ్వరికిఁ గావలయును. నోరుమూసికొని నడువుము?

సర్ద—నేను నోరుమూసికొని నడువవలయునా? ఎంతకఠినుఁడవు? ఎంతక్రూరుఁడవు? కాకున్నచో నాయవస్థ మాటనట్లుండనీ-కన్న కుమారుని యీవిధముగా బంతివలె వాడుచు నడుచుచుందువా? నీ హృదయము పాషాణమిళితమైనది. నీవు రసపుత్రుఁడవా? కావు. కావు కటికివానికి జన్మించవలసిన వాఁడవు. (అటు నిటుఁజూచి రూపావతి శవమును గనుఁగొనినదై) ఓరీ! అధమాధమా! ఎవరురా? యింత ఘోరకార్యమున కొడిఁగట్టినది?

మాన—నడచెదవా? వదరుచు నటులనే నిలువఁబడియెదవా?

సర్ద—ఏమిరా? క్రూరా! వెఱ్ఱిలెదవు? నామాట నీకు వదరులుగా దోఁచుచున్నవా? మూర్ఖా!

సీ. త్రాగుడునేర్చి తు ♦ రుష్కజాతినిఁగూడి
కులధర్మముల నబ్ధిఁ ♦ గలిపినాను
మాయజూదమునందు ♦ స్వీయసోదరినోడి
యందరిలోనిందఁ ♦ బొందినానొ
కఠినత్వమున స్వీయ ♦ కాంతామణిని నిట్లు
నేలపైఁ బడఁగొట్టి ♦ నగడినాను
కన్నకుమారకుఁ ♦ దన్నజాలిమొలేక
నావిధబంతిగా ♦ నాడినానొ

నేనమానుష కార్యముల్ ♦ నీవలె నొన
రించి సిగ్గింత లేక ఁ జ ♦ రించినా ను
నదురు బెదరు లేకుండఁగ ♦ వదరుచుంటి
ననుచు నన్నేలరా యన ♦ ద ధమచరిత.

రనపుత్రాంగనల కందఱకు శిరోమణినై వెలుఁగొందు యీసుగుణల లామను దక్కించుకొందువురా? మహాపాతకములన్నియు నీ మొగము మీఁదఁ దాండవమాడుచుండ నీకిట్టి బుద్ధులు పుట్టకేమగును? రాజపుత్రి సంస్థానమునందుఁ బుట్టిన కుక్కకైన విశ్వాసమున్నది గాని నీకు మాత్రము లేకున్నది. చేతులకు జోడుఁదగిలించి యంతటి రచ్చలో నిరువైపుల భటులుగావలిఁ గాయుచు నిలువఁబెట్టినపుడు, తండ్రిగారు శిరచ్ఛేదన మొనర్పవలసినదని యాజ్ఞ నీయ నీప్రాణముల రక్షించిన మానినీమణి యెవరురా? ఇంతలోనే కృతఘ్నుఁడవై పోతివిరా?

మాన — ఇదియేనా నాప్రాణ సంరక్షణముఁ జేసినది (అని భార్య శవమును కాలితో దన్నుచున్నాఁడు)

సర్ద — (అతికోపముతో) నీకు వినాశకాలము దాపురించినది. ఆసతీమణియును రూరకఁబోదురా మూర్ఖా! అసువులఁ బాసి నేలపైఁ బడియున్న యీసాధ్వీమణిని కాలితోఁ దన్నెదవఁటరా? నీకాలు భస్మీభూతము కాదేమి? నీ కాయువు సరిపోవదేమి? అథగవానుఁడు తనకన్నుల విప్పఁడేమి? ఆకాలుఁడు తనపాశముచే నిన్ను బంధింపఁడేమి? "పాపీ చిరాయు" వనినట్లు నీకే యాయుర్దాయమును బెంపుఁజేయుచుండె నేమిరా? ఛీ! ఛీ! నీ మొగముఁ జూడరాదు? నీతోడ భాషింపరాదు, నీకలుషములన్నియు మమ్ములఁ గూడ నావరింపఁగలవు?

గీ. నడువరా క్రూర ! చెఱలోన ♦ నిడరమూర్ఖ
నడువరా! పాపి! మ్లేచ్ఛుని ♦ కిడర తుచ్ఛ

సడువరా! ద్రోహి! ఫలితంబు ♦ గుడవరా! దు
గంతక! యివన్నియును నీదు ♦ అంతమునకు
సాయపడు లేర! యిద్ది ని ♦ శ్చయము లేర.
(అనుచు నడుచుచున్నది)

మానసింహుండును (వెంటనడుచుచున్నాఁడు.)

## తృతీయరంగము

చెఱసాల

రాజసిం—తాతా! ఆకలి యగుచున్నది

కేశి—నాయనా! కొంచెము తాళుము. (తనలో) ఆహా! ఎంత దురవస్థ సంభవించినది. అంతటి రాజనై సకలమును గలిగియుండి యు నేఁడొక్క బాలునకింత యాహారమును గూర్పఁజాలని నిర్భాగ్యుఁడనగుదునని తలఁచితినా?

రాజసిం—తాతా! చూడు నాపొట్ట ఆకలి కెట్టు కొట్టుకొను చున్నదో?

కేశి—(చూచి) నిజమేనోయి నాయనా?

చంద్రా—హా! కుమారా! నీకెన్నిపాట్లు వచ్చినవిరా! నాయనా?

గీ. తల్లినిన్ గోలుపోతివి ♦ తండ్రియెందు
కక్కఱకు రాకపోయెను ♦ అన్ని నీకు
వేళకున్ గూర్చువారము ♦ విధివశతను
గాలిలోనిట్టి కడగండ్లు ♦ గడుపవలసె.
(అంతలో భటులు హారమును దీసికొనిరాఁగా)

రాజసిం—(చివాలున నందునున్న రొట్టెఁదీసికొని) తాతా! నేనీరొట్టెఁ దిందును!

కౌశి—(లాగుకొని) నాయనా! నీవీరొట్టెఁ దినఁగూడదు. ఆరొట్టెలును హారమును యరులచేఁ బంపఁబడినవి. అయ్యవి విషపూరితములై యుండును, నాయనా తినకుము. నీవు కొంచెముసేపు నిదురఁబట్టించుకొనుము. తండ్రీ! ఇంతలోనే నీకాహారము రాఁగలదు.

రాజ—నేను నిద్దురఁ బోయెదను గాని నేను లేచుసరికి హారమును దెప్పింతువా?

కౌశి—ఆహా! తప్పక, దెప్పించుదును.

రాజ—అట్లయితే నేను నిద్రఁబోయెదను. (పరుండును)

కౌశి—సుందరీ! చంద్రావతీ! మనగతి యిట్టుల వచ్చినది. నీ స్వప్నఫలిత మీరూపుగాఁ బరిణమించినది. అనుగుణలలామ' అనురూపసంపద, అమానవతీ శిరోమణి, నాగారా బంపు కోడలు సమయమునకు వచ్చి నాయుద్యమమును విఫలమొనర్చినది గాని లేకున్నచో మనకీపాట్లు రాఁగలవా? నేనటుల నీకుమారుని యాకఁటిబాధను దీర్పఁగలనా? ఓచంద్రావతీ! ఈదురాత్ముఁడు. ఈఛండాలుఁడు మనకుఁ బుత్రుఁడై జన్మించనేల? ఓరీ! క్రూరా? మానసింహా!

గీ. తల్లిదండ్రుల మొదలఁ గృ ♦ తఘ్నుఁడవయి
చెఱనునుంతు వెయిటుల దు ♦ శ్శీలనీవు

అవును. నీవు కృతఘ్నుఁడవే.

గీ. ప్రాణరక్షణఁ జేసిన ♦ పత్నినెయటు
జేసినదురాత్ముఁడవు యేమి ♦ చేయలేవు!

చంద్రా—ప్రాణేశ్వరా! మనకీ చెఱనుండి విముక్తి యెన్నఁడు?

కౌశి—ఈశ్వరునకనుగ్రహ మెప్పుడు వచ్చునో అప్పుడు.

చంద్రా—ఈశ్వరునకనుగ్రహమనునది కలదా ?

కౌశి—లేకేమి ?

చంద్రా—ఉన్నచో !

గీ. నిరతరాధులఁబూంచు మ ♦ న్నించి న్యాయ
పాలనమొనర్పఁ జొక్కఁడై ♦ వంబు మానల
సాధుశీలయౌ సావలి ♦ సంగతీసటుఁ
జేయఁ నే పుత్రికనునిట్లు ♦ జేయుచుంట్కొ.

మఱియుఁ,

గీ. కనులు తిన్నఁగఁ దెఱువనే ♦ రని బుడుతను
మొట్టిగోల నెఱుంగని ♦ యీనిసువును
పాపమనక యీవిధి నేల ♦ బందుకొనఁగఁ
జూచి సహియించునే? దయఁ ♦ జూపరాఁడె.

గీ. అన్నమో! తాతా! అవ్వా! య ♦ టంచు నంత
పోరుఁ బెట్టుచునుండ నీ ♦ ముద్దుబాలు
గోలవినరాఁడె యతనికీ ♦ గోడలేదె
కనికరము గల్గువాని ల ♦ క్షణమొయిద్ది

కౌశి—దేవీ! ఇదియంతయు విధి విధానము. వాని వ్రాతకు భగవంతుఁడైనను నడ్డుకొనలేడు, ఏనాఁడెట్టి యవస్థలనందుమని యాతఁడు మన ముఖములందు వ్రాసెనో వాటినన్నిటిని మనమనుభవించి తీఱవలయును. అందులకై మనము చింతపించి మాత్రమేమి చేయఁగలము?

చంద్రా—ఈకర్మంబుల ననుభవించుటకు మనమెట్టి దోసమైన నొనర్చియుండవలయును గద?

కౌశి—ఈకర్మానుభవములిప్పటివిగావు. పూర్వపుజన్మలవి. అప్పుడు మనమెవ్వరి నేవిధముగా బాధపెట్టితిమో వాటినన్నిఁటిని మనమిప్పుడనుభవించుచున్నారము.

చంద్రా—నాథా! ఇది యేమికర్మానుభవమో నాకేమియుబోధ

పడకున్నది. (తనలో) నాయనా! మానసింహా! నవమాసములు మోసి, కని, పాలిచ్చి, పెంచి యింతవానినిజేసినందులకుఁ దగినకృతజ్ఞతఁజూపుకొంటివి. మాతృఋణమును దీర్చుకొనువాని యత్నములివ్వియే కాఁబోలు. సకలరాజ్యభారమును నీభుజస్కంధముపై నిలిపి విశ్రాంతి గైకొనుదమని గంపెడంతాశతో సకలవిద్యలనేర్పించి, యొక్కఁడవే కుమారుఁడవు కులముద్ధరించి మాకింత యాధారకుఁడ వయ్యెదవని గారాబమున నోమినతండ్రిగారిఋణము నీవిధముగాఁదీర్చితివా? గడియ కనఁబడకున్నఁ బ్రపంచమే మునిఁగిపోయినట్లు పరితపించి యావిధంబు ననీప్రేముడిని జూపుకొనిన నీచెల్లెలిపైఁ జవలకు నీకింత వైషమ్యముజనించినదా, మ్లేచ్ఛునకు గోహంతకునకు నీచెల్లెలినిగట్టిపెట్టి నీయంతరాత్మయెటులంగీకరించినది! నీదయాదాక్షిణ్యము లేమైపోయెను, నీచదువులన్నియు నేఁటితోఁగలిసెను! నీపాలిటికీమద్య పిశాచ మెచ్చటనుండి దాపురించినది? పరమపావనంబగు భారతభూమిని భారతీయుఁడవై బుట్టి చేయునవన్నియు రాక్షసకృత్యములేనా, పోనిమ్ము, మేమందఱము నీవిరోధులమే గానితండ్రి, నిరపరాధిని, వినయవివేకశీల, సద్గుణావతి మహాపతివ్రత, రసపుత్రాన్వయశిరోమణి, రూపావతి నీపూర్వజన్మసుకృతవశంబున నీకు భార్యయైనందులకు నామెహితంబులనైన నాదరించి గుణము మార్చుకొనకపోతివే, ఆమెను గాపాడుకొనలేకపోతివే! ఆమె దారుణకార్యమునకుఁ బాల్పడినపుడైన నామెహృదయమెట్టిదో ఎందుచే నట్టికార్యమున కుద్యమించుచున్నదో, విమర్శించుకొనలేకపోతివే, దానినిగూడ నట్లుండనిమ్ము. కడసార మైదేడులైన నరిగరాని వానికన్నులైన తెలియనివాని, చిదిపిన పాలుగారు యీచెక్కుటద్దముల వాని, మన్మథునినైతము ధిక్కరించు ప్రకాశవంతమైన యీనవ్యమోముఁగలవానిని,నీకుమారుని యీవిధముగాఁ జెరనుబడవైచి నిద్రాహారములులేకుండఁ గృశింపఁజేసితివే?నివారవనుకొందును? ఎట్టివాఁడవను

కొందును? నీహృదయము నల్లరాతికన్న కాఠిన్యమైనదగునని యెన్నఁ
డైనఁ దలఁచితివా? వంశమునకుఁ బేరుఁదెచ్చితివి? తల్లిదండ్రులకు మం
చిగౌరవమును సంపాదించిపెట్టితివి? లోకములో బిడ్డలనుగనిన తల్లుల
నేకకోట్లు గలరుగాని యింతవిపరీతమెందైనఁగలదా, తల్లిదండ్రులచేత
భార్యచేత, చెల్లెలిచేత, బంధుగులచేత, పరివారముచేత, జనులుభటుల
చేతదాసీవర్గముచేత, ఛీయనిపించుకొనిన నీబ్రదుకొక బ్రదుకేనా?
ఇట్టిపరమదౌర్భాగ్యుఁడవు నాగర్భమునఁ బుట్టకుండినను నాకీమనో
వేదనము లేకుండునుగదా? ఈమహాపాతక కార్యములు నీకుముందునోసం
గుఫలితంబులెట్టివో గుర్తింపవైతివి. కులధర్మంబులెట్టివో విచారింపవై
తివి. కటికకులంబుల ధర్మములకన్న నీధర్మములు నీచాతినీచములై,
ఘోరాతిఘోరములై గర్భనిర్భేదకములై దనరారుచున్నవే? మాన
సింహా! ఇట్టివారే కాఁబోలు పూర్వపురాక్షసులు. ఆరాక్షసులెట్టివారో
యెఱుంగకుండినను నీవిపరీతచెయ్దములవలన రాక్షసులిట్టివారుగదా
వారిచర్య లిట్టివిగదాయని తెలిసికొంటిని. నీయట్టివారిని కొమరులుగా
బడసినచో నెట్టిఫలితముగలుగునో లోకమున కొకమంచిగుణపాఠమును
నేర్పితివి? ఇంతకన్న మమ్ములనేమిచేసెదవు, మాప్రాణములఁ గొనఁదీ
యుదువుగాక, ఆపైనేమిచేసెదవు! అందఱి యసువుల నొక్కమాఱు
గ ననుభవింతువు. దిక్కులేని దుర్మరణంబు జెందెదవు. ఈదారుణకృ
త్యంబుల ఫలితంబును దరదరంబులఁ దాకఁగుడిచెదవు.

కేశి—సుందరీ! ఎంతకాలమిటుల విలపించుచుండఁగలము? ఊర
డిల్లు మూరడిల్లుము.

చంద్రా—దేవా! ఊరడిల్లకఁ జేయునదేమునిఁగలదా?

గీ. కర్మమును ననుభవించుచు ♦ గాలమెటులో
గడుపుచున్నాము దుఃఖము ♦ విడచినాము
భారమంతయు దైవము ♦ పైనివైచి
కనుకుఁబుట్టించుకొందుము ♦ కొంతసేపు।

కేకి—అటులయిన లెమ్ము. ఈతలంబంతయు నొకతూరిదులిపెదను.

చంద్రా—మీరుదులుపు టేమిటి?

(అని తానుదులుపుచున్నది)

(ఇరువురు వండుకొనుచున్నారు)

(తెఱవాలును.)



# చతుర్థరంగము



చెఱసాల ప్రవేశము సర్దర్బా:-

(స్వగతము) ఆహా! దైవమా! ఎంతఅన్యాయ మొనరించు చుంటివయ్యా,

గీ దీనులను బాధఁబెట్టిన ♦ దిక్కులేక
నసలుట మోగాని యొడిలోనఁ ♦ బడగవిడెడు
ఫలమదేమైననున్నదే ♦ వారిజాక్ష
ఎందులకుఁ గ్రోధమీవు వ ♦ హింతువయ్య.

ఒక్కగర్భమునందుద్భవించిన వారియందే యిట్టి పరస్పర వైమనస్యములఁగల్పించి నాటకమాడించుచుంటి వింకనెట్టివిచిత్ర చెయ్యముల నీలోకమందుఁ బ్రకటింపుచుంటివో? తండ్రీ! దయామయా! ఆర్తత్రాణ పరాయణుండను బిరుదంబువహించితివట యీవిధముగ నేనా! అయ్యో మాకింకదిక్కెవ్వరు? ఎవ్వరిని మేముశరణము వేడవలయును. మామానములఁ గాపాడుకొనుటకిక తెలియదేది! ఓదీనశరణ్యా! మాకుసంభవించిన యీపెనుముప్పును దలంచుకొని యేడువలేక యేడువలేక మాయోపికలఁగూడఁ గోలుపోతిమి, నిద్రాహారములకు దొంగమువాచితిమి.

మారక్తమంతయు దోమకాటులకే ధారపోసితిని. మాశక్తిసామర్థ్యము లేయుడిగిపోయినవి. ఇంకెంతవఱకని బాధపెట్టెదవు? (ఆలోచించి) ఛీ ఛీ! నేనీవిధమున వాపోవనేల? ఇప్పట్టున ధైర్యమువలంబించి సరియగు ప్రతిక్రియనూహించుటయే మంచిపద్ధతి. ఏమిచేయుదము (ఆలోచించి) ఇటులఁ జేసెదఁగాక. కానిమ్ము. వంచకుని వంచనవిధంబుననే వంచింప వలయును. ఇందుఁ బాప మేమాత్రమును లేదు.

(ఇంతలో ఆహారమును దీసికొని భటుఁడు వచ్చును.)

సర్దా—ఓయీ! భటాగ్రేసరా! నాకొక్క సహాయముఁ జేయ వలయును.

భటు—ఏమిటీ అమ్మా! అది!

సర్దా—నీవు వేగముగాఁ బోయి మీయధికారియగు రహిమత్ ఖానుని నేను అత్యవసరముగ రమ్మంటిననుము.

భటు—అచ్ఛా! జాతా హూఁ మాజీ (అని వెళ్లును)

సర్దా—హా! రూపావతీ! నీవీసమయంబుననున్న నాకెంత సహాయభూతురాలివై యుండువోగదా? నామూలమునఁగదా నీకింత టిదుర్మరణంబు సంభవించినది? నామూలమునఁగదా. నీవంతలేని కష్టంబుల ననుభవించవలసివచ్చినది? అయ్యో! వదినే! నీవిషయము స్మరణకువచ్చినప్పుడెల్ల నీదుఃఖము పొంగిపొరలి పోవుచుండునుగదా! మహారాజన్మాంతము నిన్నుఁదలంచుకొని విలపించుచుండవలసినదే యని విధియానొసల్ల లిఖించెఁగాఁబోలు. నీవు లేకపోవుటచే మారసపుత్రిస్త్రీ సమాజమంతయు నిస్తేజమైపోయినదిగదా? అయ్యో! మేమీవియో గమును భరించుటెట్లో తోఁచకున్నయది హా! రూపావతీ! రూపా వతీ! మాకిడుములందెట్టి చిచ్చుఁబెట్టిపోతివమ్మా, (అని విచారముతోఁ బండుకొనునంతలో)

(రహీముల్ ఖాను ప్రవేశము)

రహీ—(చెఱసాలతాళముఁ దీసిలోనఁ బ్రవేశించి) మాకీవర్తమాన్ చేసిందిమీకీనిజం,

సర్ద—అవును. వర్తమానంబంపితిని.

రహీ—కైకుఁ బోలో,

సర్ద—ఎందుకనియా ప్రశ్నింతురు. (తనలో) నీగతియేమిగానున్నదో తరువాత చూచుకొనవచ్చును లెమ్ము. (ప్రకాశముగా) ఖానువర్యా! ఎంతకాలమునన్ని చెఱయందుంచఁ దలఁచితిరి?

రహీ—మీకటాద్బ్యం మామీదా హెప్తూకులాయించిందీ హాంటే అప్టిదాకా!

సర్ద—ఇంతియేగదా! మీగొప్పదనమును గూర్చిగాని, మీరాజవైభవమును గూర్చిగాని నాకుఁ దెలిపిన వారెవరు సుమండీ!

రహీ—సచ్ హై? మాదీరాజం వాడ్కెనూసీ కంచర్గించర్ యివాంయిచ్చి వుండాయ్. మాదీమీనం వాడీమీదనిమ్మల్ ఖాకుంటాయ్వుంది, మాదీసేతుల్వాదూ ఖత్తిపట్టిందీహాంటే ఏక్దమ్ రొయ్యిమందికి సఫాయిసేస్తాది. మాదీబీబీవుండిందీలేదూ దాన్కి మాపాణాల్వాడీమీద ఖిల్ఖుశల్వుంటాడ్. మళ్ళీ! మీకీనూడండి మాకీఏక్ముద్దూ తిన్పించిందీవుంటే మాకీ లచ్చల్కిదాలచ్చల్ గురితియేస్తాందాసీల్కిదా దాసీల్ తల్గీపిస్తామ్. సూరుడ్, చంద్రుడ్ మీమీదాదాడిచేసిందీవుంటే మాతురకాబిడ్డావుండిందీలేదూ అడ్కెపిరంగుల్ ఖత్తుల్, ఖటారుల్యిాల్లకీ తల్గీపించీ సఫాయిచేస్తామ్. మీకీనికాసేస్కుందిఅంటే బీబీసేసీ మాదీబీబీఃహాదూవుండాదూ లేదూ అడ్కెదాసీకసేస్తాఁ దేఖో.

సర్ద—సాహేబుగారూ! మీకు సారాయమనినఁ జాలయిష్టమనివిందును. నిజమేనా?

రహి—నిండా హిష్టంవుంది. పీపాల్ పీపాల్ పీర్సీచేస్తామ్ దేఖో. మాము సల్మాణ్ తడాఖా! కోఁహైరే.

భటు—హాజర్ హై !

రహి—జల్ది సారాసీసా లేకరావ్?

భటు—అచ్ఛా ! (అని నిష్క్రమించి సారాయమును, గ్లాసును దెచ్చియిచ్చును)

రహి—మీకే ముందుపీయేతో మాకేనిండానంతోషంవుంది.

సర్ద—నాకింతవఱకెన్నఁడును నలవాటులేదు. నేను మీయాధీనమైన పిమ్మట పుచ్చుకొనకుందునా ! గ్లాసిటుదెండు. నేనుపోసి యిచ్చెదనిటులెండు.

రహి—అహాహాహా వాహావా ! మాదీ పానాల్యావూ మక్కా-మెల్లీపో నాడ్-మామీదా మీకేహింతకటాచ్చంవుందీ అని తెల్పిందిలేదుగా అండి ! అచ్ఛా ! దాలో-దాలో-అమ్మా-దాలో-జల్దీదాలో-(అనిగ్లాసుయియాయఁగా)

సర్ద—(గ్లాసునిండ సారాయమును పోసి యిచ్చును.

రహి—ఉండూ అమ్మా. ఉండు. ఖుదాపుల్ వాడ్కీ సెల్యూ యిచ్చివస్తాయ్ మాకీ (అని జోడూడఁదీసి సోఫాపైఁగూర్చుండి త్రాగును) సలాం. మీదసలాం పెడ్తాయ్.

సర్ద—మఱియొక గ్లాసునిచ్చెదను. (అనియిచ్చును)

రహి—అచ్ఛాదాలో-(అనిత్రాగును)

సర్ద—ఇంకొక గ్లాసు నిచ్చెదను. (అనియిచ్చును)

రహి—దాలో హామ్మావాడూదాలో అమ్మా ! మాకీ పీల్చి చేస్తాంగాఅండి. (అని త్రాగును)

సర్ద—(మఱల గ్లాసునింపుచుండును)

రహి—ఫిర్ దాత్రె క్యా ?

సర్దా—మీకుఁ గావలసినంత యిచ్చెదను (అనియిచ్చును)

రహి—బరాబర్, బరామర్. మాఖురావాడిపైన షైతా వాడూ ఎక్కిబజాయిస్తావుండాడ్. ఖర్. హైరో!

సర్దా—మిగులఁ బోసితినిగా! దీనిని మాత్రము పుచ్చుకొనుము,

రహి—అచ్ఛా! మీదీమాటా విన్నాకపోతే మాకీ కోంపా ఖూల్తుంది. (అనిత్రాగును) అమ్మావాడ్. మాకీవొక్కముద్దూ తిన్పించిందీహాంటే మాదీపాస్నాల్యాదూ చంతోషం వస్తాడ్ హైతో.

సర్దా—(స్వామీఁదఁ బ్రిక్కఁగాఁ గూరుచుండును)

రహి—ఒక్కముద్దూ తిన్పించూహామ్మావాడ్! (అని ముద్దుపెట్టుకొనఁబోవు)

సర్దా—మీకు ముద్దులకేమిలోటుండును. నేడు మాత్రము నన్ను క్షమించుఁడు. నేడు నాశరీరమస్వస్థతగనున్నది. రేఁపుతప్పక మీకోరిక నరవేర్తును.

రహి—అచ్ఛా! తేరామాట ఖరారూ చెస్తాయ్.

సర్దా—రేపుతప్పదు.

రహి—బరాబర్ హై! చంతోచంగావుండింది. జరాసోజాతే. హమ్మావాడ్-మాదీకోటూ, యిడ్చియేస్తాయ్ హుక్కాగావుంది. (అటులొనర్చి నిదురించును)

సర్దా—అమ్మయ్యా! ఈక్రూరాత్మునకు గాఢముగ నిదురఁబట్టినది! నేనింక నాప్రయత్నమున నుండవచ్చును. నాయొద్ద బాకున్నది గదా! దీనికిఁదోడు (వాని మొలయందున్న యొరనుండి ఖడ్గమును దీసి) ఇదిగూడ నాకు సహాయకారికాఁగలదు. ఈయర్ధరాత్రిమున నన్నెవ్వరును గుర్తించకుండ పురుషవేషమును ధరించుట యుత్తమమని తలంచెద. (ఆలోచించి) బాగున్నది, సమయమునకు నాకీకోటుకూడ

సక్కఱకు వచ్చినది. (అని పురుషవేషమును ధరించుకొని) నన్నిప్పుడు గుర్తింపనెవ్వరును సమర్థులుగారని తలంచెదను, బహుళః పిరిగుడారములముందు గుఱ్ఱము లుండవచ్చును. ఏదోయొక్క గుఱ్ఱము నెక్కి పలాయనమగుటయే మంచిది. (అని సాహెబుకడకుఁజని) నిదురించుచున్నట్టు లేనా (కదిపిచూచి) ఆహా ! నిదురయే ! సమయముఁగూడ బాగుగానున్నది.

గీ. త్రాగినిదురించినట్టి యం ♦ దయును వచ్చి
పట్టివాఁడును సములంచు ♦ వార్యులనెడి
మాటపట్టి దిగాదది ♦ నేటితోడ
తెలిసికొంటినీ మూర్ఖుని ♦ వలననిపుడు.

ఇంకనాలస్యమొందులకు పోయెదను గాక (నిష్క్రమించుచున్నది)





# సతీసక్కుబా·

## చతుర్థాంకము.

(ఒకకొలనుతీరము)

ప్రవేశము సక్కుబా !

సక్కు—ఆహా ! యిప్పటికి గదా ! నాదాహమును దీర్చుకొనుటకుఁ దగిన నీరమునుగాంచఁగలిగితిని. ఏమిగాలి వీచుచున్నది. ఈవృక్షచ్ఛాయను నిక విశ్రమించెదఁగాక. ఈలోపలనశ్వముగూడ బడలికఁ దీర్చుకొనఁగలదు. (నెమ్మదిగా నడచుచు) అయ్యో ! దగ్గఱకుఁ జేరుటకుఁగూడఁ దగిన ఓపికలేకున్నది. ఏమిచేయుదును ? అబ్బా ! ఆయాస మతిశయించుచున్నది. నిదురించెద. (అని అటులనే పడిపోవును)

భగవాన్ (ప్రవేశము)

భజగోవిన్దమ్ భజగోవిన్దమ్
భజగోవిన్దమ్ మూఢమతే
సంప్రాప్తే సన్నిహితేకాలే
నహినహిరక్షతిడు కృఞ్కరణే॥భ॥

సక్కు—అబ్బా ! దాహము. దాహము.

భగవాన్—(చూచి) ఎవరు చెపుమా ? దాహము దాహమనుచున్నారు-(చూచి) పాపమీతఁడెవరో మార్గాయాసముచే నిద

ట విశ్రమించెఁ గాఁబోలు. దగ్గఱకుఁ బోయిచూచెద అని పరిక్ర
మించి) ఓయీ! నీవెవఁడ?

సర్ద—(పలుకకుండును)

భగ—పాపము-పలుకకున్నాఁడు.మూర్ఛావస్థయందున్నాఁడు గాఁబోలును-(అని కొద్దిగా నీరమును మొగముపైఁ జల్లి లేవఁదీయును)

సర్ద—(కూర్చుండి ఆయాసపడుచుండును)

భగ—అయ్యా! ఓపికయున్నచో! నీవెవరవో ఎందుండివచ్చుచుంటివో, నీవింతబడలిక కెందుఁ గారణమో తెలుపుము?

సర్ద—అయ్యా! నేనా? శ్రీకిమహారాజకుమార్తె...అఁ కాదు. కాదు. కుమారుఁడను.

భగ—కుమార్తె-అఁ కాదు కాదు. కుమారుఁడనంటివి. ఇందు నఁబట్టి చూడనీవు. నీస్థితినంతయు గుప్తముగా నుంచుకొని నటులఁదెలి యుచున్నది. నా యెడల నీవనుమానించనక్కఱలేదు.

సీ॥ వయసుఁదీరిన వాఁడను ♦ భాగ్యభోగ
ములను వదలి వనాంతర ♦ ములను జేరి
కందమూలాదులను దిని ♦ కాలమెల్ల
నారమేశుని కరుణకై ♦ యర్పణంబొ
సర్చినట్టి వాఁడనునను ♦ నమ్ముమిల॥

నీస్థితినున్నదున్నటులనే వచింపుము.

సర్ద—మహానుభావా! నేననుమానించిన సంగతివాస్తవమే-నాస్థితియిది మహాత్మా! నాయన్న మానసింహుఁడనువాఁడు త్రాగుబోతయి మారసపుత్రులకు గర్భశాత్రవులగు తురుష్కులతోఁగూడి జూదమాడి యందునన్నుఁ బందెముగా నిడియోడిపోయి నన్నట్టిలైన నాతురుష్కుల స్వాధీనముఁ గావింపవలయునని విశ్వప్రయత్నములు

సేయసాగెను. అక్కా! తవాదినేటివఱకు నాకుటుంబమునకుఁ గలిగిన విపత్తులనేను నానోటితో నేమని వచింతును? ఇది కారణముగా నావదినె గారకాలమృత్యుదేవత పాలఁబడియెను. తల్లిదండ్రులు చెరయందుంచఁబడిరి. నేనును నిన్నటివఱకుఁ జెరయందే యుండియే తురుష్కుఁడు నాపైఁగన్నువైచి యింతఘోరపాతకము నాడించెనో వానిని మోసగించి యిటులఁ బలాయనమైవచ్చితి. దేవా! నేఁడునా పాలిటదైవసములై కానుగన్పించిరి.

భగ—అమ్మా! ఎంతపని జరిగినది? నీపేరేమమ్మా?

సర్ద—నాపేరు సర్దార్బాయందురు.

భగ—అమ్మా! సర్దార్బా! నీవు నీస్వేచ్ఛరీతిని నాయాశ్రమమునం దుండవచ్చును. నీకేమియు భయము లేదు. తల్లీ! నీకుఁ గొలది కాలములోనే శుభములు రానున్నవి. అమ్మా! ముందీనీరమును త్రాగి దాహముఁ దీర్చుకొనుము.

సర్ద—(త్రాగును)

భగ—అమ్మా! మనమింక నాశ్రమమునకుఁ బోవుదము. రమ్ము. దేవపూజా కాలము సమీపించుచున్నది. ఆ అశ్వము నీవెక్కి వచ్చితివి గాఁబోలును. దానిని నెమ్మదిగా తీసికొని వచ్చెదవా?

సర్ద—చిత్తము.

(నిష్క్రమించుచున్నది.)

## ప్రథమరంగము.

[వీరసింహుఁడు ప్రవేశము]

రాణీపురమున కింక నెన్నిదినములు ప్రయాణముఁ జేయవలయునో? అబ్బా! నాలుగుదినములనుండియు రాత్రింబవళ్లు ప్రయాణము

సహించుచున్నను దీనికంతు రాకున్నది. (జేబునుండి పటమును దీసి) సుం
దరీ! నిన్నుదర్శించుభాగ్యము నాకెన్నడబ్బును. ఔరా! కాలమహిమ!

గీ. నిన్నుదర్శింపఁగా నెంత ♦ నేనుతంద్రి
పడుచునుంటినో యంత నా ♦ పైనమిపుడు
మందగతిఁ జెందుచున్నది ♦ మానినీయిఁ
కెంతకాలము నేను స ♦ హింపవలెను!

ఓ కాంతామణీ! ఇంతకష్టమనుభవించుచు నేను బ్రయాణ మొన
ర్చుచున్నను నాకు లక్ష్యము లేకున్నది. నీదర్శనానంతరము నన్నాదరింతు
వా? యింక నన్నుమించువారీ ముజ్జగంబులందుఁగూడ సుందరనియే నా
నమ్మకము (పటమును ముద్దుఁబెట్టుకొనుచు) మదవతీ! నీచిత్తరువే నన్నిం
తగా భ్రమఁబెట్టుచుండ నో నీరూపు రేఖావిలాసంబుల స్వయంబుగ వీ
క్షించినచో నేనింక నెంతపరవశుఁడనగుదునో? ఓ అశ్వరాజమా!

గీ. ఇంక నేని యడుగులు మెల్ల ♦ నిడఁగకుండ
చులుకఁదనము నాకీయనింతఁ ♦ జూపెదేని
మదవతిని వేఁ కలసి నీదు ♦ మాటఁ జెప్పి
పారితోషిక మిప్పింతుఁ ♦ బడయుమమ్మ!

ఓ ప్రభాకరా! నీవైనపుణ్యంబుఁ గట్టుకొనరాదా? నీరథంబున
కు నన్నుఁగట్టుకొని యాసుందరాంగియున్న తావునఁ విడునటుల వదల
రాదా? నీకేలఁగరుణవచ్చును. మాయట్టివారిపై నీకేకరుణయున్నచో
నింతతాపమును బుట్టింతువా? నీసహాయము నంబి వారిసహాయమువంటిది.
నేను రాణీపురమునకు చేరువకు నెందైన దాగియుందును. బడలికయును
వదిలేకుండ నట్టులెట్టులో నామనోహారిని గలసికొందును. ఇదియే నీవు
నాకు జేయఁదగిన సహాయము. అల్లదిగో! చేరువనొక కొలనుగాన్పించు
చున్నది. అచ్చటకుబోయిఁ యించుక నీరముఁద్రావెద (అని యటుల
జేసి) ఈకొలనులోని నీరము నిత్యమువాడుకలో నున్నటులఁగాన్పించెడి

ని. ఈవిజనారణ్యమధ్యంబున నీసీరమును వాడుచున్న వారెవరైయుం
దురు? అడవిజాతులవారైయుందురు. వారేమైనచోఁ ద్రోవమధ్యం
బునవారికిటీరములైనఁ గాన్పింతువా? కాదు. ఎవరైనఋష్యీశ్వరులు
తపస్సుచేసికొనుచుండవలయును. అటులైనచో వాశ్రమముండవల
యుఁగదా? ఎవ్వరున్నమనకేమి? మనత్రోవనుమనముపోయెదము.
ఈయెండవేడిమి నన్ను వెంటనే ప్రయాణము చేయనిచ్చుటలేదే? ఇంచు
కంతవిశ్రమించి పోవుదము. (అనిపక్కవేసికొని పరుండి మఱలఁ బట
మునుజూచుచు) ఓలావణ్యాశిరోమణీ! నీసౌందర్యము నామనంబును జిం
దరవందరఁ జేయుచున్నది. నిదురరానిచ్చుటలేదు. ఏమియుఁదోచని
చ్చుటలేదు. హారముగైకొనుమన్న బుద్ధిపొడముటలేదు. ఎంతత్వరితగ
తినిన్నుఁగలియుదమన్నను నాప్రయాణమంతకంతకు మందగించుచు
న్నది. ఓరీ మదనా! నీబాణములెంతచుఱుకైనవిరా? పౌరుషవంతమై
యలరారు రసపుత్రవంశోద్భవుండనయ్యు నిన్నుమాత్రమేమియుఁ జే
యఁజాలకున్నాఁడను. నేనేయననేల? నీదారికెవ్వరును నెదురురాలేరు
నీతోడివైరమునుబూనలేరు. నీప్రభావమునడఁగాఁగొట్టలేరు. నీకుఁ
బాదాక్రాంతులై శరణమువేడినచో నీకుదయయున్ననింతభిక్షబెట్టుదు
వు. లేనిచోనదియునులేదు. కాని యీదీనునిమాత్రము పొడలఁ
గొట్టకుము.

గీ. ఇంచుకంతవేచెదవేని ♦ యొటులనేని
జేరువాఁడరాణీపుర ♦ సీమకేను
పిదపనీస్వేచ్ఛఁ జెలఁగుచు ♦ బదునుగలుగు
బాణములచేతబాధింప ♦ వచ్చుమదన!

గీ. వామనోహారియును నేను ♦ ప్రేమమెయిని
సంచరించునప్పుడు విఘ్న ♦ మించుమయ్య

రొంటరిగనున్న నాపైని ♦ యుద్ధమునకు
దిగినవాడు శ్రీరాముంబు ♦ లగుపడునొకో!

ఇదియేమి విపరీతముగ నాకలి వేయుచున్నది. ఇందెందైన నిం ద్లుదొరకునేమో? వెదకి చూచెదను. (అని వెదకుచు నిష్క్రమించును)

[భగవాన్ ప్రవేశము]

భగ—ఎవ్వరీ బాలకుమారుఁడు. ఈయరణ్యంబున కేటికి వచ్చెనో?

వీర—మహానుభావా! తామిందుండుతున్నారా?

భగ—అవును. ఇచటనుండువారమే.

వీర—ఇందెచ్చటనైన నిన్ని కందమూలఫలములు లభింపఁగలవా?

భగ—నీకంత యాకలియగుచున్నదా?

వీర—మహాత్మా! నాయాకలి యిట్టిదని వర్ణింపనాకు సమర్థత లేకున్నది.

భగ—పాపము, నాయనా! మాయాశ్రమమునకు రమ్ము. నీకు గావలసినన్ని ఫలహారముల నొసంగెదను.

వీర—అయ్యా! తమయాశ్రమమేమాత్రము దవ్వుఁగలదు?

భగ—చాలదగ్గఱనేయున్నది.

వీర—తాపసోత్తమా తమయమూల్యోపకారమునకనేక వందనములు. పోవుదమా?

భగ—రమ్ము రాకుమారా! రమ్ము.

వీర—(తనలో) దిక్కులేనివారికి దేవుఁడే తోఁడని పలుకుటిందులకే కాఁబోలు. విజనారణ్యములని పేరునకే గాని భగవంతుఁడెచ్చోట లేఁడు? దీనరక్షణపరాయణుఁడుగదా? శరణాగతబిరుదాంకితుఁడుగదా? అయ్యా! గుఱ్ఱమునిచ్చటనే నిలిపివచ్చెదను.

భగ—నీయిష్టము. ఈయరణ్యమున నెవ్విధమైన భయమును లేదు.

వీర—చిత్తము. ఇదియంతయు నీశ్వరవిలాసము. సదువ్రము.
భగ—రమ్ము. (అని నిష్క్రమించుచున్నారు.)

---

## ద్వితీయరంగము.

కాలనుతీరము,

వీరసింహుఁడు ప్రవేశము.

వీర—ఎంతమంద భాగ్యుఁడను? చేతజిక్కినయవకాశమును జెడ గొట్టుకొంటిని. మునికూడ దటిలేచి తటిదారికెను. ఆమానాత్మలక్షణం బుల నెచ్చటనో వీక్షించినస్మృతి తగులుచున్నయది. నాకడఁ జిత్రఫల కముపోకడలీయమకడనగుపడుచున్నయవి. ఈమె యామెయెయుండునా? అయియున్న నిట్టిదురవస్థకు రాగారణమేమి ? అడిగి తెలిసికొనియుండిన నీ వృథాలోచనము పుట్టక నేయుండునుగదా? తిరుగపోయి యడుగుదమ న్న మఱలివచ్చిన హేతువును నేమని చెప్పఁగలుగుదును. ఏతద్వృత్తాంత ము సరయక ముందునకడుగు తెగువలేకున్నయది, పాడుసిగ్గు మంచి తరుణమును పాడుచేసినది. మర్యాదపూర్వకముగాఁబ్రశ్నించినకొం చెము వృత్తాంతము తెలిసెడెడి. ఈమెసర్దర్బాయేమోయనుభ్రాంతి కాదే మోయనుసందేహముమనస్సునుకల్లోలపఱచుచున్నయది. ఆమెయెదుట సర్దర్బా యను నామముచ్చరించియుండిన నామెముఖలక్షణము లైనను ఆమెవృత్తాంతమును ద్యోతకము చేసియుండెడిది. గతించినదానికిఁజింతిం చినఫలిలేదు. ఇఁకముందు యోచన (ఆలోచన మభినయించి) అశ్వము నధిష్ఠింపఁబోవునప్పటికిది కదలకున్నది. అందులకు గారణమరసికొనవా జిని బరీక్షింపఁ జరణము బెణికినగతి కనుపట్టినది. అందుచేదానికిఁ జికి త్సనొనరించి కొంతవిశ్రాంతినొసంగిన తరువాతఁ బ్రయాణమైపోవుటకు

నిశ్చయించితినని నాపునరాగమనమునకునాయమయడిగినఁగారణంబు గానుడివెదను. ధైర్యమువహించి, ఆసుందరి చరిత్రమును దెలిసికొని యెదను. మానసమా సిగ్గుఁ బోఁద్రోలుము! సాహసము పూనుము. అనుమానమును నివర్తింపుము. నీస్థైర్యమునందే యీకార్యసాఫల్యము నిలిచియున్నది.

[అని నిష్క్రమించును.]

### తృతీయరంగము.



కొలనుతీరము.

మాన — అయ్యో! నాదశయెంతకువచ్చినది! ఈసర్దర్బాను యె నిమిదిదినములలోఁబట్టి యొప్పగించనియెడల కంఠమునుత్తరింతునని రహిమత్ఖానుఁడు దీక్షబూనియున్నాఁడే? ఏమిచేయుదును? ఎక్కడను న్నదని వెదుకుదును. వెదకివెదకి వేసారిపోతిని. ఓరా! రెంటికినిఁ జెడి నరేవడిఱీతినైనదేనావని.

సీ. తల్లిదండ్రుల దయా ♦ దాక్షిణ్యములు లేకఁ
జెఱలోనవసియింత ♦ జేసినాఁడ
కఠినుండనై ప్రాణ ♦ కాంతను గోల్పోయి
యేకాకిబ్రతుకు వ ♦ రించినాఁడ
చెనఁటినై జూదమం ♦ దునఁ జెల్లెలినోడి
వంచనబుద్ధిఁజ ♦ రించినాఁడ
కులధర్మములమంటఁ ♦ గలిపిమ్లేచ్ఛులవంచ
బడి చరించుటకుపా ♦ ల్పడినవాఁడ!
... అన్నివిధముల భ్రష్టత్వ ♦ మందినేను
బ్రతుకగా నయ్యో నేను ని ♦ ర్భాగ్యవశత!

కాలమా! నన్ను నెట్టిదు ♦ ర్గతికిఁదెచ్చి
బాధపెట్టుచున్నావు ♦ పాపమనక॥

గీ॥ పావనంబగు రసపుత్రి ♦ వంశమందుఁ
బుట్టిలాంఛనమగు కత్తిఁ ♦ బట్టియిట్లు
మొరక లాతుర్కలనుగూడి ♦ బూదిఁగల్పి
కొంటి నావిద్యలకుకీర్తిఁ ♦ గంటిఁదుదకు॥

గీ. కనినవారెల్ల ఛీయంచు ♦ ననుఁజివాట్లఁ
బెట్టువాటిని నొకమూలఁ ♦ బెట్టినంత
తంబు మధుసేవఁజేసి యు ♦ కంబుఁ గోలు
పోయి చరియింపనెల్ల న ♦ న్యాయమయ్యె.

(ఆలోచన మభినయించి) ఛీ! చెడినవాఁడను చెడనే చెడితిని. ఇప్పుడు మంచిపేరువచ్చునా? నాగౌరవకీర్తుల నార్జింపఁగలనా? తలపెట్టినకార్యమునందు విముఖుఁడను గానేల? మదుద్యమమందుమూడువంతులు నిర్వహించి యిఁకనొక్కవంతునకా వెనుకంజవేయుట? ఏమైనఁగానిమ్ము ఇఁక నెనిమిదిదినంబులు గడువుగలదుకదా! ఈయరణ్యప్రాంతములఁ గూడ వెదకెదనుగాక. పోయెదను (అని కొంతదూరమునడచి) చాల దూరము ప్రయాణము చేయుటచేఁ గాఁబోలు దాహబాధ మిక్కుటంబుగ బాధించుచున్నయది. ఈకొలనులోని నీరమతినిర్మలమై దాహపీడితులగు వారికెంతయో శాంతముగ స్వాగతమొసంగుచున్నది. కొంచెము దాహముఁదీర్చుకొనియెదఁగాక (అని దాహముఁబుచ్చుకొనుచున్నాఁడు)

సర్ద—(ప్రవేశము) ఈకొలనుకువచ్చుటయనిననుయీ ప్రాంతమునఁగల కందమూలముల సేకరించుటయనినను నాకుత్సాహములు దినదినాభివృద్ధిం జెందుచున్నయది. రాణివాససౌఖ్యములకన్న యీాశ్రమనివాసమే అన్నివిధముల శ్రేయమైనదని స్వానుభవమున గ్రహింపఁ

గలుగుచున్నదానను. ఈయాశ్రమనివాసముచే నాకష్టములనే మఱచి
నట్లగుచున్నది. కాని యాశ్రమమున తిరుగుబోయగువాఁ డెవ్వరును లేక
పోవుటయుఁ దఱచుగా మునీంద్రులవారు బయటకుఁబోవుచుండుటయుఁ
దటస్థించుచుండుటచే నొంటరిగనుండ భయమగుచున్నది. (ఆలోచించి)
ఇదేమి! ఇచటనే నిలువఁబడితిని. నిన్నటిమహానుభావుఁడు రాఁగలఁడే
మో! పరిశుభ్రమగుజలంబును ఫలాహారములను సిద్ధముగనుంచుమని
గదా మునీంద్రులవారియాజ్ఞ. ఆమహానుభావుఁ డెవ్వరయి యుండును?
వీరసింహమహారాజు కాఁడుగదా! నేఁజూచిన చిత్రఫలకమునకును
వీనిరూప రేఖావిలాసములకును వీసమేనియుఁ దారతమ్యమున్నట్టుల
గానిపింపదే. వీరసింహుఁడేయైనచో నన్ను గుర్తింపకుండునా? నాచిత్ర
ఫలకము వానికడనున్నదిగదా! మనోహరా! నామనంబునుహరించియు
నింతవఱకు నీపదనారవిందసందర్శన మహాభాగ్యమునాకుఁ గలుగఁజే
యకపోవుటకు నేనుగావించిన మహాపరాధమేమి? నేనిట్టియవస్థల నందు
చుండినను నీకింతవఱకుఁ దెలియలేదా? అయ్యో! తెలిసియుండిన బాం
ధవ్యము మాటయెట్లుండినను సాటివంశజుల మింతటియవస్థలో నుంటి
మని సహాయమొనర్పనైన రాకుండువా? అయ్యో! హృదయేశ్వరా?
నేను నీకర్ధాంగలక్ష్మినై సుఖపడుభాగ్యమే నాకున్నచో బ్రతుకీవిధంబు
గనుండునా?

మాన—ఎవరానిలుచున్నది? (అనిపరకాయించిచూచి) అవు
ను సర్దర్బాయే. సందేహములేదు. అమ్మాయ్యా! నాకష్టములు నెరవే
రినవి. ఇంకెందాఁబోఁగలదు. (అనిచివాలునఁబరువెత్తుకొనివచ్చి సర్దర్బా
ను పట్టుకొని బలవంతముగ లాగికొనిపోసాగును.)

సర్ద—(విడిపించుకొనుచు) ఎవరునీవు? నన్నేలపట్టుకొంటివి?

మాన—(విడువక) నేనెవరిననియా! నేను మానసింహుఁడను
నీయన్నను. నీవు మారువేషమును దాల్చినంతనే నిన్ను గుర్తించలేద

నుకొంటివి కాఁబోలు. నడువుము. ఎంతదూరము పోఁగల్గుదువు?

గీ. మానసింహుని కంఠాన ♦ బ్రాణముండు
దాక విడుచునె నిన్నదెం ♦ తటి దురంత
కార్యమైనను వెనుఁదీయఁ ♦ గాఁగలండె
యింతయత్నంబు విడువ స ♦ హించునొక్కొ॥

సర్ద—(మణిల గట్టిగా విదలించుకొనుచు) నీయత్నమునువిడు వవా? విడువవా? (పట్టునువిదలించుకొని దూరముగా నిలువఁబడి) నీవు విడుచుటేమిరామూర్ఖా! (బాకుదీసి) ఇదియే విడిపించగలదు. ఈబాకు నాచేతనున్నంతవఱకు నీవుగాని నిన్ను పుట్టించిన బ్రహ్మగాని నన్నేమియుఁ జేయఁజాలరని నిశ్చయించుకొనుము. ఓరీ! క్రూరా! అమానుషమైన యీబ్రదుకు బ్రదుకుటకంటెఁ జచ్చి భూదేవిభారము ను దీర్చరాదా? నాయన్నవని చెప్పకొనుచుంటివా? ఎక్కడియన్నవు? ఎక్కడి చెల్లెలను?

గీ. నిక్కముగఁ జెల్లెలనైన ♦ నిక్కరణిని
నదురుబెదురు లేకుండఁగ ♦ నన్నుఁబట్టి
కరకతురక కర్పింపంగ ♦ గడఁగగలవె?
పాతకుఁడ నీకునాకు సం ♦ బంధమేమి॥

పో! పొమ్ము. ఇంకనైన జాగ్రత్తగ బ్రతుకుము. నాకన్నయు నులేదు నీకు చెల్లెలును లేదు. నాచేతులారనిన్ను వధింపలేక నింతటితో విడచితి. ఇంకను నీదుర్మార్గమును విడువకున్న చో నీపాలిట నీబాకే యమరూపముధరించుననుకొనుము. పొమ్ము పొమ్ము.

మాన—పోవలయునా? పోవుదను. పోవుదను. నేనునిరాయుధుఁడ నైరాఁబట్టి నీవుతప్పించుకొంటివి. నీయునికి నెఱింగితిఁగదా? సరే కాచు కొనుము. (అని మీసమును మెలివేయుచు నిష్క్రమించుచున్నాఁడు.)

సర్ద—అయ్యో! ఈదుర్మార్గుఁడునన్ను వెంటనంటియేయున్నా

డే. నేనిప్పుడేమిచేయుదును? వీనిని వెన్నాడుచుఁ మనుష్యులెందఱు వ
చ్చుచుండిరో గదా? హా! దైవమా! నాకష్టముల కేనాటి కంతు లేకున్న
దే? నీదే భారము. నేనింక నాశ్రమముఁ జేరెద.

(అని నడచుచున్నది.)

వీర—(ప్రవేశించుచున్నాఁడు)

ఆఁ. ఆశ్రమమునఁ జూచిన కాంత యీయబలయే! పలుకరించి చూచెదను. (ప్ర) ఓమానవతీ శిరోమణీ! ఋషీంద్రుఁ డాశ్రమమున కు వచ్చి నన్నుఁగూర్చి యేమైనఁ బృచ్ఛించెనా?

సర్ద—అడిగినారు. నాకేమియుఁ దెలియ లేదు. మఱల వత్తు మని గాని రామనిగాని నాతోడ నేమియుఁ జెప్ప లేదు. ఇంతఫలాహారము ను గైకొని దాహమును గైకొని వెడలి రంటిని;

వీర—అందు కాతఁడేమనియెను?

సర్ద—"అట్లయిన మఱల రావచ్చును. నాతోడఁ జెప్పకుండఁ వెళ్లరు. అశ్వముయొక్క మంచి చెడుగుల విచారించుటకై వెడలియుం దురు. వారు వచ్చులోపల మఱల నిన్ని ఫలములను మంచినీరమును సిద్ధపఱచియుంచు"మని యాజ్ఞయిచ్చుటచే నందుకొఱకే నేనీకొలనుకు వచ్చితి.

వీర—కాంతామణీ! మీయుపచారమున కెంతయుఁ గృతజ్ఞుఁడను. (తనలో) హృదయమా? తొందరపడకుము. (ప్రకాశముగా) మాన వతీ! నీరూపరేఖా విలాసములను బట్టి నీవొక రాకుమారికవలెఁ గాన్పించుచున్నావు. నాతలంపు నిజమైయుండునా?

సర్ద—(తలవంచుకొని) యూరకుండును.)

వీర—తలవంచుకొనియెదవేమి? చెప్ప నిష్టము లేకున్నది కాఁబోలు?

సర్ద—మహాత్మా! చెప్ప నిష్టము లేకఁ గాదు, నాప్రస్తుతా

వద్ద నావిషయము నంతను గూఢముగా నుంచుకొనుమని ప్రబోధించు చుంటచే నిట్లంటిని.

వీర — ఏమీ ! నీస్థితి విషమదశయందున్నదా? పాపము! ఓమా నినీమణి! నీకష్టోదంతము ను నా చెవులఁ బడవైచితివేని నాశక్తి వంచన లేని సహాయము నొనర్చెదను. నీ వెంతమాత్రమును సందియపడ నక్క-ఱలేదు.

సర్ద — ఆర్యా! నామూలమునఁ దమకుఁ గష్టమెందులకు?

వీర — ఒక యబలకష్టదశ యందున్నప్పుడు తన్నివారణోపాయమునకుఁ గడంగుట కష్టమగునా ? అంతియేగాక?

గీ. క్షత్రియుఁడనుగ జన్మించి ♦ శస్త్రమిటుల
హస్తమునఁదాల్చి ధర్మమా ♦ ర్గానుసారి
నై చరించెదు నాకొక ♦ యబలఁగాచు
టనిన విధిగాని కష్టకా ♦ ర్యంబుగాదు.

మఱియు.

గీ. జన్మసాఫల్యకార్యముల్ ♦ సలుపలేని
హీనులవని జన్మింపఁగ ♦ నేలనట్టి
వారుగిట్టిరిభూదేవికి ♦ భారమింత
దీర్చుచో నామెకెంతయో ♦ తేలికగద॥

సర్ద — (తనలో) ఈమహానుభావుఁడు వీరసింహుఁడేయై యుండును. అడుగుదమన్న నేమనుకొనునో! హృదయమా! సిగ్గును రవంత సేపావలకుఁ బాఱఁద్రోలుము? (ప్రకాశముగా) ఆర్యా! తమరెవరో- నే- నడు- గవ- చ్చునా?

వీర — దానికేమి సందేహమా ? చెప్పెదను. రాజపుత్రుఁడను వీరసింహుఁడను- చాలునా?

సర్ద—(తలవంచుకొని ఓరకంటఁ జూచుచు) ఆర్యా! అట్లనా?

వీర—అబలారత్నమా! నానామమును మాత్రము తెలిసికొనివ సంగతిఁ దెలుపకపోవుట భావ్యముగా నుండునా?

సర్ద—దేవా! తెలుపకుందునా? రాజపురసంస్థానాధీశుపుత్త్రికను. సర్దార్బాయను దానను. నేనే- (అని విచారవదనయై నిలువఁబడుచున్నది.)

వీర—ఎంతమందమతినైతిని? ఎవరి ముఖారవిందసందర్శనమునకై యీప్రయాణము సల్పుచుంటినో, ఏయిందుముఖి కరుణాకటాక్షవీక్షణములకుఁ బాత్రుఁడను గావలయునని తాపత్రయపడుచుంటినో, ఏవనితవలన నేను శాశ్వతానందవార్నిధి నోలలాడుదునని యుర్రూతలూగుచుంటినో, ఆమానినీమణినిఁ గట్టెదుటఁ బెట్టుకొని నేనెంత పరితాపపడుచుంటిని, యువతీశిరోమణీ! నాకష్టమున కింతటితో స్వస్తిఁ జెప్పించి నందులకు నీకీ దాసుఁడు శాశ్వత కృతజ్ఞుఁడునుమా?

సర్ద—ఎంతమాటంటిరి? ఈనిర్భాగ్యురాలి కంత భాగ్యము కూడనా? నాకట్టి దశయేయున్నచో నేనిన్ని కష్టములలోనుందునే?

వీర—సుందరీమణీ! నీకష్టోదంతమును దెలుపవలసినదని నేనిదివఱకే యడిగితిని. కాని తెలుపవైతివి!

సర్ద—తెలుపకదీఱునా? నేటికి భగవంతునకనుగ్రహముకలిగెనని సంతసించుచుంటిని. ఆర్యా! మాసోదరుని విషయము మీరెఱిఁగియేయుందురు.

వీర—ఏదియో కొంతవఱకు లోకవాడుకగా వినియున్నాఁడను.

సర్ద—వానిమూలముననే మావంశమునకిన్నికష్టములు వచ్చినవి. దేవా! మిగత వివరములన్నియు నెమ్మదిగా విన్నవించుకొనియెద

ను. కాన ముఖ్యవిషయముల మాత్రము మనవిచేసెదను- ప్రస్తుతము వారలిదంద్రిలు చెఱయందున్నవారు. నేటికెనిమిదవవాఁడు తన్నుఁ దురుష్కవివశముఁ జేయుకున్నచో వారికంతము లుత్తరింపఁబడును.

వీర—నిన్నేల తురుష్కులకు సమర్పించవలయును,

సర్ద—కారాగృహమునుండి పలాయనంబగుటవలన.

వీర—నీ కారాగృహనివాసమునకుఁ గారణము?

సర్ద—నాయన్నగారి క్రూరప్రవర్తనమే కారణము.

వీర—నీసోదరుఁడు నీపైనంత కతు వహింప నీవేమి దోష మొనర్చితివి ?

సర్ద—నేనాతనికి సోదరినై జన్మించుటయే దోషము. దుస్స హావాసమువలనఁ ద్రాగుబోతయి, కష్టములఁ బ్రోగుచేసికొని పోవ మాపురమున కేతెంచిన రహిమత్ఖానునితోడ జూదమాడి నన్నోడిపో యి కొట్టులేని నన్నుఁ బట్టి వానివశముఁ జేయ నింత వాటక మాడించెను.

వీర—సర్దార్బా ! మన రస్యపుత్రవంశము నందింతటి ప్రజ్ఞా వంతులుగలరా ?

సర్ద—ఆర్యా ! మామానసింహుఁడు చాలఁడా ?

వీర—ఔరా ! కాలమహాత్మ్యము! సుందరీ ! మానసింహుఁ డిప్పుడెందున్నవాఁడు?

సర్ద—నిముషముక్రింద నిచటనే యున్నవాఁడు.

వీర—ఇచ్చటి కేలవచ్చెను?

సర్ద—నన్ను వెదకుచు వచ్చెను.

వీర—నీయన్నయంత కాతిన్యుఁడా ? అంతదుర్మార్గుఁడా? అం తవలుగాకియా ?

సర్ద—ఆర్యా! నాకేమియుఁ దెలియదుగాని వానిని గూర్చి నే నెఱింగినది. ఒకనాటి యర్ధరాత్రమునఁ దురుష్కులువచ్చి యేర్పాట్లు చేసి రొక త్రాటి సహాయమున వారినందరి నంతఃపురంబునఁ బ్రవేశ పెట్టి మమ్ములఁ బట్టుకొన యత్నింప మావదినెగారగు రూపావతి తన పెనిమిటిని నెటులైన మంచిమార్గమునకుఁ ద్రిప్పవలయునని యెంత యో యత్నించెనుగాని యామె యత్నములన్నియు నిరర్థకములగుట చేతను, నాసంరక్షణమే యాబిడకు ప్రధానోద్దేశముగానుంచుకొనుట చేతను, నాసమయమునకుఁ దానే ద్వారమువద్దఁ బహారాయిచ్చుచుం డుటచేతను, తన ధర్మమును సంరక్షించుకొనుటకై పెనిమిటిని జంపఁ దనయంతరాత్మ సమ్మతింపనందున నామెయే యాత్మహత్యకుఁ బాల డితెను. ఆ కాలమందుఁ దానుండియు నిర్దయుఁడై యావంక వీక్షింపక తిన్నఁగా లోనికిఁ బ్రవేశించి నన్నుఁ బట్టుకొని బంధించి తెచ్చుచు నాశవమును గాలితోఁ దన్నె. నన్ను తలిదండ్రులఁ జెఱయందునిడె. వాని హృదయమిట్టిదని నేనింతకన్న నేమి చెప్పఁగలను! దేవా!

వీర—ఆహా! ఆవీరమాతముఖారవిందమును వీక్షించు భాగ్య మునాకు లేకపోయినదిగదా, ఓసతీమతల్లీ! రూపావతీ!

గీ. అట్టిసమయానసేన యు ♦ న్నట్టులైన
ద్వచ్చరణమందుఁ గాఱు ర ♦ క్తమును మొగము
నందుఁ దాలిచి ధన్యుఁడ ♦ నగుదుగాదె
తల్లి! నిర్భాగ్యునకు సద్ది ♦ దక్కవలదె.

ఇంతయేలనమ్మా! నీయడుగులకు మడుగులొత్తుచు, నీపెనిమిటియే గానిమ్ము. వానిని సృష్టించిన బ్రహ్మనేగానిమ్ము. శిరచ్ఛేదనమాచరిం చి అమ్మా! నీకనులయెదుట నాశరీరమునకు రక్తాభిషేకముఁ గావిం చుకొనకుందునా? నీ కాజన్మదాసుఁడనై నీచరణసేవఁ జేయుచుఁ గాలముఁ

గడుపుకొనవా? నీకీచావును దప్పింపకుందునా? సర్దర్బా! ఆయర్థరాత్రిమం దంతఃపురమునఁ జొరఁబడిన తురుష్కులేమైరి?

సర్ద—వారందఱును యిరువురిచేతను నిహతులైరి.

వీర—సెహబాస్. కాంతామణీ! స్థితినంతయు సవిస్తరముగా వింటినిగదా? నిన్నుఁ దురుష్కుల బాఱిఁబడకుండరక్షించుటయు, నీజననీ జనకులఁ జెఱనుండి విముక్తులఁ గావించుటయు మాయన్నను. (అని చెప్పుచుండ)

సర్ద—అపాయము మనకేల?

వీర—అబ్బా! సుందరీ! అన్నగారిపై నెంతదయ?

గీ. ద్యూతమున సిగ్గులేకుండ ♦ నోడిపోయి
చెల్లెలను ప్రేమలేకుండ ♦ చెఱకుఁజేర్చి
కలుకుతులుకకు నిన్నంటఁ ♦ గట్టఁదలఁచి
యింతలోనరించువానిపై ♦ నెంతప్రేమ.

గీ. ఆగతినిజాదగాడయి ♦ త్రాగుబోతుఁ
అగుచు రసపుత్రవంశము ♦ నందుఁ బెద్ద
మచ్చఁ బెట్టినయట్టి దు ♦ ర్మార్గునిపయి
నేటికో సుందరీ! నీకు ♦ యింతప్రేమ.

గీ. కన్నతలిదండ్రులనెడి ల ♦ క్ష్యంబు లేక
గాఱిలోఁబెట్టి యువ్విధి ♦ గాసిలంగ
జేసిమ్లేచ్ఛుల పంచను ♦ జెలఁగుచున్న
హీనుపై! నీకు యేటికో ♦ యింతప్రేమ.

గీ. సకలసద్గుణవతి మన ♦ జాతికెల్ల
మకుటమని జెప్పుకొనగు ♦ మాన్యురాలి
నాగతిని గాలితోఁ దన్ని ♦ నట్టిఖలుని
నేటికో! చూచెదవు కాంత ♦ యింతప్రేమ.

గీ. పౌరుషము ఖ్యాతిబూదిని ♦ గలిపి రాజ
పుత్రవంశపు ధర్మముల్ ♦ మరాలఁద్రోసి
హేయ్యాగతిఁ జెందుచున్ జరి ♦ యించువాని
నేటికో! చూపెదవు కాంత ♦ యింత ప్రేమ.

సర్ద—ఆర్యా! వానిపైఁ బ్రేమముంచుకొనిగాదు నేనట్టులని నది. వీరసింహులను సార్ధకనామధారులగు మీరు మాకండయైయుండ వానిదుర్మార్గకృత్యంబులు మమ్ముల నేమిచేయఁగలవు? వానిజోలిమన కేలయని యట్లంటిని. దేవా! ఆతఁడింతకుమున్నే యీబాకునకు గురి యైయుండవలసినదిగాని తనకుఁదానే వెనుక మగిడిపోవుటచే యింకను బ్రదికినాఁడు.

వీర—సుందరీ! నీమాటనేల గాదనవలయు, నీవీశ్రోవనే రాణీ పురముఁ జేరుము. నేను నీయశ్వమును నీకొసంగెదను, నేనును నీవెను వెంటనే వచ్చినీ తలిదండ్రుల విముక్తులఁ గావింతును.

సర్ద—తాము కాలినడకను వచ్చుటయును నేనశ్వము నెక్కిపో వుట యునామహాత్మా! అటులవలదు. ఆశ్రమంబున నాయశ్వమేగలదు. దానిపై నధిష్ఠించివచ్చెదను.

వీర—అట్లయినచో సార్వభౌమున కిటియంతయు విన్నవించి నేనశ్వము నెక్కివచ్చెదను, నీవీయశ్వముపై వెడలుము. చేతిలో బాకు కడుభద్రముగా నుంచుకొనుముసుమా?

సర్ద—చిత్తము, (అని గుర్రము నెక్కిఁబోవుచుండ)

వీర—మదవతీ! వీరసింహునిని.........

సర్ద—దేవా! నేను కృతఘ్నురాలను గాఁజాలను. (అని తల వంచుకొని నెమ్మదిగా ననుచున్నది)

వీర—ఏమో! నీదయ,

(ఒకరినొకరు చూచుకొనుచు నిష్క్రమించుచున్నారు)

---

## —చతుర్థరంగము—

(ఒక యొడారిలో మానసింహుఁడు ప్రవేశము.)

దైవ మనుకూలుఁడైనపుడు సర్వమును దానిననుసరించియే జరుగుచుండును. ఓ అశ్వరాజసూ! ఎంతపనిఁ జేసిపోయితివి, తగినబుద్ధి చెప్పితివే. కన్నవారలఁ గాఱుఁబెట్టినందులకు, కుమారుని నిర్దాక్షిణ్యుఁడనై శిక్షించినందులకు, అతిశయముచుగాలితోఁ దన్నినందులకు, చెల్లెలినిక ఱకు తురకకంటఁగట్ట నింతనాటక మాడించినందులకు, త్రాగుఁబోతునైనందులకు, జారుఁడనైనందులకు, జూదరినైనందులకు గోహంతకులగు మ్లేచ్ఛులతోఁగూడి విహరించినందులకు, వంశమునకుఁ గళంకము గూర్చినందులకు, గర్వపోతునైనందులకు, నంతఃపురద్రోహినైనందులకు, దగిన శాస్తిఁగావించితివి. ఛీ! ఛీ! మానసింహా! మొన్న నిన్నా తురకగొట్టుచు సర్దార్బ పలాయనమునకు నీవేగారకుఁడవని యనరాని దుర్భాషలనాడి మఱలఁబోయి పట్టితెమ్మని గెంటినప్పుడైనను సిగ్గుఁదెచ్చుకొని నీపరాక్రమమునుజూపి యాదుష్టంతకుని నంతకాలయమునకుఁ జేర్చి చెఱనున్నతల్లిదండ్రులను నీకుమారుని విముక్తులఁగావించి నీయపరాధములనన్నిఁటిని క్షమింపుమని వేఁడుకొనినచో నీకీయవస్థ రాకుండెడిదిగదా, అట్లేలఁజేయుదువు? తలఁదీయుమని తండ్రిగారియాజ్ఞయైనపుడు దొంగయేడ్పులనేడ్చిన దానిఫలము, హితములనన్నిఁటినో దెలిపిన యర్థాంగలక్ష్మిని దిరస్కరించిన దానిఫలము కన్నకుమారుని బంతులలీల నాడుకొనుచుఁ జెరఁజేర్చినఫలము, నిన్న సర్దార్బకనుపింప నామెను మఱలఁ బంధింపఁజూచిన దౌర్జన్యఫలము, నీవీవిధంబునఁ బొందుమని యావిరించి నీమొగముపై మూడుపంక్తులవ్రాయ నీవేమిచేయుదువు? అయ్యో! నేనీబాధనుండి యింక విముక్తుఁడను కాఁగలనా, కాఁజాల, కాఁజాల, కానక్కఱయే లేదు. ఇంతటితో బుద్ధిదెచ్చుకొనినను నాకీ

గాయములుపోయినను నన్ను నమ్మి యాదరించువారెవ్వరు? ఇంత జేసిన
వాఁడనేమని నాతలిదండ్రులఁజూతును? తెగించి చూతమనినను వీలు
గాన్పింపదే! సర్దార్బాను పట్టితీసికొని పోవకున్న రహిమత్ఖానుఁ డూరు
కొనునా, ఛీ! ఛీ! చివఱకుఁ దురుష్కనిహస్తంబునఁ బ్రాణములవద
లనా, దయామయా! పరాత్పరా! నాకింక నాయువుపోయకుము. అబ్బా
ఈగాయముల బాధ భరింపలేకుంటినే! ఏమిచేయుదును. ఈవిజనప్రదే
శమున నాకుదిక్కెవ్వరు? చివఱ కేకాకినై చావవలసివచ్చినదే. ఇది
యునొకమేలే. మానసింహుని విపరీతపు బ్రతుకీలోకమున కొకగుణ
పాఠమగుఁగాక. ఏమానవుఁడును నావలెఁ బ్రవర్తించి దుర్మరణ మంద
కుండెదరుగాక. ఇదియంతయు నమానుషకృత్యముల ఫలితము. స్వయ
ముగాఁ జేతులారఁ గొనితెచ్చుకొనినతద్దినము. అమ్మా! సర్దార్బా! బాకు
నూరకఁజూపించితివిగాని నీచేతితో నీవక్షస్థలమునఁబొడిచియున్న నెం
తబాగుండెడిది, యూపాపతి! నేనునీపెనిమిటినని తలంచి వృథాగనీప్రా
ణములఁదీసికొంటివిగాని యాపరమనిర్భాగ్యదామోదరునిపైని నీకం
తప్రేముడి యేలగల్గినదో తెలియకున్నది. నిన్ను మాకులదేవతగఁ జేసి
వంశము వారెల్లరు సేవించుచుందురుగాక, ఈమానసింహుని దుర్మర
ణంబుతో నీయాత్మకు శాంతిగలుగుఁగాక, ఓతల్లిదండ్రులారా! ఓనా
కుమారా! మీయవస్థలెట్లున్నవో తెలిసికొనఁజాలనుగదా, అమ్మా!
చంద్రావతీదేవీ! నీకుమారుఁడే పుట్టలేదనుకొనుము, ఓరహిమత్ఖానుఁడా,
నీకష్టముల వసూలుచేసికొని నీతోఁబ్రవను నీవుపోక నీకీదుర్బుద్ధి యేలఁబు
ట్టినది? నిన్నింతమాత్రమును నిందింపరాదు. కోరినరీతిఁ బందెమిడి
వంశమున కంతకును మారకుఁడనైననన్ను నేనే నిందించుకొనవలయును.
ఓరీ! పాపాత్ముఁడా! విశ్వనాథుఁడా! నీవు నాపాలిఁట నెక్కడనుండి దా
పురించితివి? నన్నామధుసేవకేలఁ బాత్రునిఁగావించితివి. ఓ మద్య
రసమా! నీలోని మహాత్మ్య మిదియా, అందుకొఱకే మహా

మహాలగు కవులందఱావిధంబుగ నిన్ను దూషించియున్నారు. నీప్ర
భావమిట్లుండుట చేతనే? నావివరుసలువమ్మాయి, దానధర్మంబులు
శూన్యమై, దయాదాక్షిణ్యములు పూజ్యమై, మతాచారములు మాయ
మై, సత్యశౌచములు నాశనమై, దేశమధోగతిలోఁ బడిపోయినది మా
ప్రారబ్ధవశమునఁగాదే నీవు భారతీయులకందఱకును గులదేవతవైతివి?
ఆనుపగజ్జెలతల్లిని మావశముఁ జేసితివి. పరమతాచారముల మానెత్తి
పైఁబెట్టితివి! తారా! నిన్నీయవస్థయందేమని స్మరించుకొనను? మానా
భిమానముల మంటఁగల్పుకొని పదిమందిలోఁ దైతక్కలాడుచుఁగాని
దబ్బుకేనియుఁ గక్కుర్తిపడెడులంజలు మీరు. మాపాలఁబడి మమ్ము
లమోహవార్ధిలోముంచి యీగతిఁ జెలరేగుటచేతనే మాకీగతులుప్రా
ప్తమై చరిత్రాత్మక పురుషులమయ్యు సాంఘిక దురాచారబహిష్కార
ప్రబోధకనాటకరాజంబులందుఁ గథానాయకుల మగుచున్నారము.
ఓ వేశ్యకులాంగనా! నీవింక నేని యీవృత్తి విసర్జించి మీవారినందఱను
వివాహితులుగఁ గావింపఁ బ్రచారకురాలవయ్యెదవుగాక! ఈగాయముల
తోనేనింక మరణించుటయేకర్తవ్యమా! (లేవఁబోయి పడి) ఆహా! యెం
తటిదురవస్థకుఁ బాల్పడితిని? లేచుటకుఁగూడఁ గాళ్ళుస్వాధీనములుతప్పి
నవే. అశ్వరాజమా! మానసింహునినాటకము నీపేరు మీఁదుగానం
తరింపవలసియున్నది కాఁబోలు, పుణ్యముఁగట్టుకొంటివి. నిన్నే భగవం
తుఁడు యమరూపినిగావించి నాకొఱకుఁబంపెఁగాఁబోలు. నేనునీకేవిధ
ముగ నాకృతజ్ఞతను దెల్పుకొనవలసియున్నదో గ్రహింపనసమర్థుఁడనైతి.
నాగతి యిట్లయ్యెనని యీవార్తగూడ నీవే నా వారికందఱకును
లియఁజేసి యాపుణ్యమునుగూడగట్టికొమ్ము. నీకివే నావందనశతంబులు.
ఓ జీవములారా! మీకీమానసింహునిపై నింతయభిమానమేల? వానిని
విడువకున్నారేల? మీదారిమీరు చూచుకొనుఁడు, మానసింహా!
నీవు బ్రతికిమాత్రము చేయఁదగినదేమున్నది? పూర్వార్జితంబయిన

రాజ్యము నభివృద్ధిఁ జేతువా ? పెద్దలగౌరవకీర్తులకు వన్నెఁ బెట్టుదువా? ధర్మసంస్థాపనముఁ గావించెదవా ? అగర్భశత్రువులగు తురుష్కుల నామరూపంబులు లేకుండఁ జేయుదువా? సత్యదేవతకు స్థిరనివాసమేర్ప రచెదవా ? ఆయాశలన్నియు నీరూపముగాఁ దీరిపోయెను. అట్టికోరి కలు మాత్రములవలను. ఈ కార్యములు నీవలన నెరవేరవు. అబ్బా ! ఈ బాధ సహింప దుర్భరముగా నున్నదే. ఓ నమయవర్తీ-నీపాశమును-నాపైనవైచుము. ఏమనుచున్నాఁడవు? నాకుఁ దీరికలేదు. భటులనంపె దననుచుంటివా, పోనిమ్ము. వారితోడనే వచ్చెదను. వారితో మాత్రము-త్రోవమధ్యంబున-నన్ను-ఏవిధముగాను- బాధింపవలదని-గట్టిగాఁ జెప్పుము, ఆ యేళ్లను దాటించునపుడు-ఆ పర్వతంబుల మీఁద కెక్కించునపుడు. అకంటకావృతారణ్యసీమల నడిపించునపుడు-నన్ను శిక్షించకుండ నన్నుఁ దొందరించకుండ-నాయొనర్చిన మహాఘోరకార్యములకు నిందించకుండ శాంతభావమున-నన్నాదరించునటుల వారి కుత్తర్వులఁ జేయుము, ఓచిత్రగుప్తా! నాకు మీ వ్రభువు శిక్షలు విధించుటందు-నీచేతనగు నహాయమును జేయుము. నాదోసములలోఁ గొన్నిటి మీఁద పద్దుగీతలనుం చుము. అన్నియు నీ వేకరువుఁ బెట్టిన నాకతన శిక్షలకు నే నాగఁజాలను. వట్టియర్భకుఁడను. అచటి యవస్థలలో నగ భాగమిచ్చుటనే యనుభవించుచున్నాఁడను. ఓ నా స్వజనములారా! నేనిచట-నుండియే-నాతుది వందనమును దెలుపుకొనుచున్నాఁడను, (ఆయాసముతో) అయినది-నాయా-యుర్దాయము సరిపోయినది. నాకాజ్ఞయైనది. హా ! మానసింహా ! పోమ్ము. హా ! రజపూతవంశమకుటమా-రా-పా-వ-తీ-హా-సతి-హా-యీశ్వరా-సె-ల-వు-(అని ప్రాణముల వదలుచున్నాఁడు.





# సతీ సద్ధర్మః



## పంచమాంకము.

### చెఱసాలలో

ప్రవేశము కేకిమహారాజును. చంద్రావతియు. రాజసింహుడును.

కేకి — దేవీ! కుమారుని దయవలన నేటితో మన జీవితము లంత మొందుచున్నవి. మనము మన ప్రాణవాయువుల నిర్విచారముతో వదలివేయవచ్చును. అంతటి బ్రదుకు బ్రదికి చిట్టచివఱకుఁ జెఱసాల యందు నీవిధంబుగా నారితో-పౌత్రునితో దిక్కులేని దుర్మరణంబు నందవలసివచ్చెనే. చంద్రావతీ! నీవు నాకు భార్యవగుటఁ బట్టిగదా! నీగతి యీగతి యయ్యె. నాయనా! రాజసింహా! మేము పాపాత్ములము. కావుననే పసికూనవగు నిన్నుఁగూడ మాతోడఁగొనిపోవలసి వచ్చినది. నీతండ్రి యింత దుర్మార్గుఁడైనను నీవైనమాకింత ఆధారభూతుఁడవై, యిన్నినాళ్లు వదలెదవని యెంతయో యాశనుండ మాయాశయడియాసమై యీరూపముగాఁ బరిణమించినది. హా! మానసింహా! కులమునంతటిని నాశనముచేసితివిగదా! తల్లిదండ్రులపై నింతకక్ష సాధించుటలు ప్రపంచమున నెందైనఁ గలదే! ఆహా! ఎంతవిచిత్రిన టనము జరిగినది? దేవీ! మనకిపుడు కర్తవ్యమేమి! భగవన్నామస్మరణమేగదా! ఓ దైవమా!

శా॥ ఏపాపంబు నెఱుంగనట్టి మముని ♦ ట్లేపంగభాగ్యంబు; నీ
వేపాలింపక నూరకున్నయెడ మా ♦ కెవ్వారు దిక్కౌదురో
యాపద్బాంధవ ! యీవిపన్నులకు నీ ♦ వాధారమై వైళమే
కాపాడంగను రాఁగదయ్యా ! అకలం ♦ కా ! భక్తచింతామణీ॥

మ॥ కులధర్మంబుల మేఱమీఱను వృథాఁ ♦ గోపింపనెవ్వారి; భృ
త్యులనిందింపన కారణంబుగ, దురు ♦ ద్యోగంబుచే నెట్టిహిం
సలకున్ దావోసఁగంగఁబోను ! బుధదా ♦ స్యంబెప్డు వర్జింప నెం
దుల కిట్లారడిఁ బెట్టెదో సుజనబం ♦ ధూ ! భక్తచింతామణీ॥

మ॥ తనయుండజ్ఞుఁడు మానహీనుఁడును నిం ♦ దావర్తనుండయ్యె మ
జ్జన నాథాన్వయమింతతో నరిమె పూ ♦ జ్యంబైన రాజ్యంబునా
మనుమం డేలు నటంచునాశపడ నా ♦ మాత్రింబునన్ గూడనీ
ఘనశోకాగ్ని దహించు నేటి కకలం ♦ కా ! భక్తచింతామణీ॥

శా॥ స్త్రీలోలుండనొ? త్రాగుఁబోతునొ? మదాం ♦ ధీభూతచిత్తుండనో
కాలంబంతయు వ్యర్థపుచ్చుచు వ్రిజన్ ♦ గగ్గోలుఁ గావించితో
యోలోకంబును నిర్ధరించి యిటులన్ ♦ హింసింతువో రాధికా
లోలా ! నీపదభక్తుఁడన్ గద ! కృపా ♦ భూ! భక్తచింతామణీ॥

ప్రియసీ ! నీవుఁగూడ భగవంతు నింతధ్యానించుకొనుము?

చంద్రా—నాథా ! నేనేమని ధ్యానింపవలయును ? పరాత్పరుని ప్రార్థింపకుండుటచేతనేనా మన మిన్నియవస్థల ననుభవించుచున్నది ?

కే—సుందరీ ! అటులఁగాదు !

గీ. కష్టముల నెన్నివచ్చినఁ ♦ గానిదైవ
చింతనము నేమఱఁగరాదు ♦ చివఱకదియె
యిహమునకుఁ గాకపోయిన ♦ నేమిపరము
నందు సార్థకమగుఁగాదె ♦ యబలమనకు॥

చంద్రా— దేవా! నామనంబంతయు నల్లకల్లోలముగా నున్నది. ఏమియుఁ దోచకున్నది. నాకీప్రపంచమే అరణ్యమయమైయున్నది. మీరెవరో నేనెవరినో భగవంతుఁడెవ్వరో నేను నిర్ణయించుటకే యసమర్థురాలనైతిని. నాథా! చివఱకు నాగతియీగతియైనది. ఓపరాత్పరా!

సీ॥ కన్న నాకాన్పు లీ ♦ గతిసిఁ బరిణమించి
యింతలు పుట్టునం ♦ చెఱుఁగనైతి
వంశంబు నేటితో ♦ ధ్వంసమైపోవు నం
చింతయేని యెఱుమది ♦ నెఱుఁగనైతి
తనయ! యీరీతిఁ బం ♦ కావార్ధిలో మున్గి
యీగతిఁ జెందు నం ♦ చెఱుఁగనైతి
కోడలాత్మహత్య ♦ కుందొగఁగొనిమాకు
యీచింతఁ బెట్టునం ♦ చెఱుఁగనైతి
యెంతనాటకమాడించి ♦ తీవు దేవ
యిప్పటికినైన నీకు రా ♦ దే! త్వదీయ
చరణదాసులమైఁ బ్రేమ ♦ సర్వసాక్షి
నీవెమానముఁ దాల్చుచో ♦ నెవరుదిక్కు.

అయ్యో! నాయనా! రాజసింహా!

గీ. నీకుఁగూడ మాతో పాటు ♦ నిందుచుండ
నేటితో నూరుయేడులు ♦ నిఖిలలోక
పాలకుండగు శ్రీహరి ♦ పైని భార
మెల్లవైదిన వానికే ♦ యీఫలితము.

గీ. గద్దెపైఁ గూరుచుండి సా ♦ ఖ్యంబుగాను
ప్రజలఁ బాలించుచును గీర్తి ♦ రమనుజెందఁ
గాంచు భాగ్యంబు లేకున్న ♦ గాని మాకు
నీకుఁగూడ యిదేమిరా ♦ రాకుమార.

దైవమా మాకు నేడు సెలవిప్పించుటయేనా ? లేతేమైనగతియున్నదా?

కేకి—దేవి ! తురుష్కుఁడు గాఁబోలు వచ్చుచున్నాఁడు. ఊరడిల్లుము.

(అంతరహిమత్ఖానుఁడు ప్రవేశించుచున్నాఁడు)

రహి—రాజా ! నీకీబుద్ధిమాతిందీ-లేదూ,

కేకి—నాబుద్ధియేమి మాఱవలసియున్నది,

రహి—సర్దర్బా యెక్డావుందీ-బోలో సచ్ బోలో,

కేకి—అయ్యా ! చెఱసాలలో నున్న మాకేమి తెలియును,

రహి—మీకీ పానాల్వాడు వుండేదీలేదూ. ఝూటామాటా సెప్తాయ్‌నీకి.

కేకి—అసత్యమాడవలసిన యవసరము మాకేమియు లేదు. మాకంతములుత్తరించుకొని పోవుచున్నను మేమందులకు లోఁబడువారముగాము.

రహి—సర్దర్బా దొరికిందీహాంటే మాకీ నిఖా-సేయడానీక-హిష్టంవుందీ లేదూ,

కేకి—అదిమేమెటులుఁ జెప్పఁగలము, ఆస్వాతంత్ర్యమంతయు నామెచేతులలో నున్నదిగదా?

రహి—మాకీ బురఖ్ తీసియేయుదానీక- మీకీ వుత్తర్వ్యాయిచ్చిందీలేదూ రాజే. . మునూ్వ.

కేకి—అట్టి ద్రోహములనే నేనుగూడఁ జేసియున్నచో నీవును అట్టియుత్తరువుఁనే చేయవచ్చును.

రహి—నీకీ నీపానాల్వాడీ మీాదాబహుత్ ఆగావుండిందీ.

కేకి—నాకీతుచ్ఛపు శరీరముపై నాశయేలేదు. ఇంతకు వచ్చినవెనుక నాకేటి యాశ. కాని యాశనులు తెలువని పసివానినిమాత్రమేమియుఁ జేయవలదు. అదియే నాకోరిక.

రహి—(కురవాని జుట్టుఁబట్టుకొని) ఉడ్కీ-యిర్చి యేయ్యాలా, యూదూఖారుడ్.

కేశి—హా! దైవమా! నామొదల నెంతకఠినత్వము వహించితివయ్యా,

రహి—అరేబే-ఢైథం యేద్దిూసేస్తాదు వోయ్. మాకీక త్రీసేస్తాది. హంతా!

(అంతవీరసింహుఁడు ప్రవేశించుచున్నాఁడు)

వీర—అవునురా! మ్లేచ్ఛాధమా! కత్తియే సర్వమును చెప్ప గలదు. అందబద్ధమేమియును లేదు. ముందాకుఱ్ఱవానిని విడిచి నాతో డసావకాశముగా మాటలాడుమురా! అధముఁడా! నీతిజాతి లేక, పాపభీతి లేక నీయిష్టమువచ్చినటుల నీరాణీపుర సరిహద్దులఁ జేరి చెలఁగుచున్నావఁటరా!—మూర్ఖా! ఈవీరసింహునికంఠమునఁ బ్రాణమున్నంత వఱకు నీయాటలేమియు సాగనేరవని నిశ్చయించుకొనుము,

రహి—తుమ్ కౌన్ హైరే. జావ్. గడబిడ్ కర్నకో,

వీర—ఓరీ! వాచాటా! ఏమిరా ప్రేలితివి? నీప్రేలాపనలకన్నిఁటికిని జెవియొగ్గి యూరకొనుటకు నానసింహుఁడనుకొంటివా? దురాత్మా!

ఆ॥ కాదు తాగుబోతు ♦ కాదు జారుఁడు కాదు
ద్యూతకాఁడు గాదు ♦ దోసకారి
వీరసింహుఁడనిన ♦ వీరసింహుఁడనుమ్ము
బుద్ధికల్గి దారిఁ ♦ బొమ్ము మూర్ఖ!

రాజపుత్రుల శౌర్యాగ్ని నీవెఱిఁగియు నిట్టులనేనఁటరా నీకండకావరము నుజూపుకొనుట, నీతలఁ దన్ను వారెవ్వరు లేరనుకొంటివి కాఁబోలు. ఇప్పటికైని నీవీదురుద్యోగమునుండి మఱలి వీరిని విడిచి

పుచ్చి నీతోఁ బ్రవనుబొమ్ము. తోడనే యిచటినుండి గుడారముల దీసి వేయుము,

రహి — నీమాటల్ విన్నాక్కు మాకీ జరూర్ లేదు పో,

వీర — ఓరీ మ్లేచ్ఛుఁడా! నామాటలువినుటకు నీకుజరూర్ లేదటరా! (బాకునుదీసి) దీనిఁజూచితివా? ఏదీ! నీవదరుఁబోతుదనమిఁకఁ జూపుము. సతీసర్దార్బాను నిక్కాఁగట్టుకొందువా? లేక నీయాలిబిడ్డలఁ జూచుకొన నింటికిమరలి పోవుదువా? ఓరీ క్రూరుఁడా! యీనిరపరాధులను నేనేవదలిపెట్టుచున్నాఁడను. చేతనైనచో నీవును నీసైన్యమును గూడ నిలచిపోరుము. లేకున్ననాకుఁ బాదాక్రాంతుఁడవై వేయిసలాములఁబెట్టి నీగంతను బొంతను జంకబెట్టుకొనినడువుము. ఓమహారాజా! అమ్మా చంద్రావతీ! నాయనా! బాలకారాజసింహా! మీరునిర్భయముగాఁగోటకుఁజేరుఁడు. (అని వారల బంధవిముక్తులఁ గావించుచున్నాఁడు.)

కేకి — వీరసింహా నామధారీ! నీదయవలన మేముబ్రతికితిమి. ఆపరాత్పరుఁడు మీరూపముగా సాక్షాత్కరించి మమ్ములనుద్ధరించెను. మేము మీకాజన్మకృతజ్ఞులము.

(అందఱు నిష్క్రమింతురు)

## ద్వితీయరంగము

[ప్రవేశము:— కేకిమహారాజు, విక్రమసింహుఁడు, సతీసర్దార్బా చంద్రావతి, రహిమత్ఖానుఁడు, రాజసింహుఁడు, వీరసింహుఁడు.]

కేకి — అమాత్యశేఖరా! మఱలనెన్నిదినంబులకు నేనీదర్బారునందుఁ గూర్చుండగల్గితిని. ఇదియంతయు నీవీరసింహుని చలువయే సుండీ,

వీర—మహారాజా! ఇందునాపత్రికాపమేమున్నదికి నావిధికృత్యముల నెఱవేర్చుకొంటిని.

రహి—రాజాసాహెబ్! మాకివచ్చిసాలా కాలామయింుందీవుంది. సెల్యూదియేతో మైజాతుమ్!

కేశి—సాహెబేంద్ర! రాజపుత్రుల విద్వేషములఁగ్రహించుట మీకు జాడిగాదు. వారిశౌర్యధైర్యములఁజూచి సంతసింపుటయే పౌరుషవంతులగు మీవంటివారికుచితము. పరాంగనావిముఖత భారతీయులకు పరమధర్మము. మతభేదములుండినను యేకదేశజనితులగుటచే హిందూమహమ్మదీయులుసోదరులు. ఏమతమునందైననుభగవానుఁడొక్కఁడేయైనపుడు యతనిప్రీతికైనియమింపఁబడిన ధర్మములన్నియు నొకేతీఱుగనుండును. వ్యసనములను మీమతగ్రంథములు నిరసించుట లేదా? పరదారాపహారణము నిరసింపఁబడలేదా? మద్యపాననిషేధము ఖురానువిధించుటలేదా? అజ్ఞులగువారు దురితములొనరించునప్పుడు దూషించి, సన్మార్గములఁబ్రవేశపెట్టుప్రభువులకు, ప్రభువులకే హితముగఁజెప్పు మంత్రులకు, మీవంటిసుప్రసిద్ధులకు యిట్టిదుష్టాచారాచరణములగునా? మీకనులముందట మీకులాంగననెవ్వడైన యొక దుష్టుఁడు పరిభవించుచున్నఁగని యోర్వఁగలరా? మానసింహునినిర్బంధపరచితిరిగదా? అలాగుననీతోఁబుట్టువును, గొనిపోయి బలవంతము మీద పరులకిచ్చుటకు సమ్మతింతువా? అట్లొనర్చుట ధర్మసమ్మతమని మీమతనియమములందున్నదా, స్త్రీమానమును గాపాడనోచని పురుషునిబ్రతుకేల? మతమేల? ఏమతమునందైనను స్త్రీలకు మాతృత్వము లేకున్నదా? మాతృత్వముఁగల్గిన స్త్రీజాతి సర్వదా మాననీయముగదా? అట్టితరిఁ బరస్త్రీనవమానపరచుట మాతృద్రోహము కాదా? ధర్మనియమములను పాటించి, భగవదాజ్ఞలను గౌరవించి,ప్ర

దాక్షమమువారసి, సామ్రాజ్యముల స్వతంత్రముగ నడిపించి, యిహ
పరభోగంబుల నిచ్ఛానుసారంబుగననుభవింపఁదగినస్థిరత్వముఁబూని
నత్రిగుణోత్తులకు—దుర్వ్యసనపారగులకు— పరవిత్తాపహారులకు—
పరస్త్రీకంటకులకు—సమస్తదుష్కార్యసంభవమహాఘ సంభావనీ
యులకుఁ—చేయూతలై తుళ్లిపడుట మంత్రులకు దగినపనియా ?
దేశగౌరవము—మతగౌరవము—పదవీగౌరవముఁ గాటింపవలదా?
అంతరాత్మనుజంపి అన్యాయమున కొడిగట్టుట హాస్యాస్పదముగాదా?
మీమతప్రవక్త మహమ్మదు బోధించిన నీతియిదియేనా? జలాలుద్దీను
ఫిరోజిషాల పాలనమునందు మహమ్మదీయమతౌన్నత్యము యేచారిత్ర
లందైనను కొంచెము పరించిచూడుము? భగవంతుఁడొకఁడని నమ్మి సక
లమతములును, తత్సన్నిధ్యప్రాప్తిమార్గములని విశ్వసించి, హిందూమ
హమ్మదీయుల నేకోదరులని భావించి విశ్వమానవసోదరత్వమును నెలకొ
ల్పినమహాగ్బరు, తానీషాలు మహమ్మదీయజాతివారలుగారా? మత
మునందుమీకుఁ గలపట్టుదలవారికి లేదా? మతనియమముల నెఱుంగరా?
ఎఱిఁగి యుల్లంఘించిరా? పరస్త్రీలఁ జెఱబట్టిరా? పాపములకొడిగట్టిరా?
త్రాగుడుకు వ్యయపెట్టిరా? మూటముల్లెలనుగొట్టిరా? రాజ్యలక్ష్మి
నపహరించుటయందుఁ, బరిపంథివర్గములఁ బరిమార్చుటయందు, శత్రు
రక్తవాహినులఁ బీల్చుటయందు, కోశాగారములఁ గొల్లగొట్టుటయందు
తమశౌర్యధైర్యములవెలయింపఁ జేసిరేగాని నీవలెఁ దుచ్ఛకార్యము
లకుఁ బాల్పడరైరి.

సీ. బలమున్న శత్రులఁ ♦ బరిమార్పవలెఁగాని
పరకాంతలను జెఱఁ ♦ బట్టఁదగదు
మంత్రిత్వమున్న సా ♦ మ్రాజ్యమేలుటెగాని
వెంగలితనముఁ జా ♦ పింపఁదగదు
పౌరుషంబున్న భూ ♦ పతులఁ గొట్టుటగాని,
క్రూరతదారులఁ ♦ గొట్టఁదగదు

ధనమున్న బీదలఁ ♦ దనుపంగవలెగాని
క్రాగుణోత్తులఁజేర్చి ♦ దనుపఁదగదు
మతముపేరిట నింకొక ♦ మతమువారి
నీర్ష్యతోఁ బాధి హింసింప ♦ నెంచఁదగదు
జగములెల్లను దమకీర్తిఁ ♦ బొగడుచుండఁ
దిమ్మరనురీతి రాజులఁ ♦ వెల్పఁదగును.

వీర—

చ॥ మతమెటువంటిదైన జన ♦ మాన్యత నొందుటపాడిగాని ధూ
ర్తతఁ బరకాంతలన్ గెలచి ♦ దారులఁగొట్టుచుఁ ద్రాగుణోత్తు సం
గతికి మనస్సునిచ్చి కల ♦ కాలము దుర్యశమూనుకంటె జీ
వితమును ధర్మమార్గమున ♦ వీడుటయుక్తముగాదె సాహెబా!

ఉ. చిక్కరె రాజపుత్రికుల ♦ చేతులకెందరో మానవతీమణుల్
మ్రొక్కరె వారికిన్ దలలు ♦ మోడ్చి స్వమాతలకట్లుయెన్నఁడేన్
జిక్కులఁబెట్టిరే, తమరు ♦ సిగ్గులఁ జెందిరె యిప్డు చేతులన్
జిక్కననిన్ను చంపుటకు ♦ సిద్ధపడం గనుబుద్ధిపుట్టనే?।

సర్ద—ఓయీ రహిమత్ఖానుఁడా! నీవంటివారు పదికోట్లమంది ప్రయత్నించినను బరమపతివ్రతామణులగు రాజపుత్రస్త్రీలులొంగువారుకారు. మగవారుశక్తిహీనులై పగతురచేఁ జిక్కినప్పుడుమగువయే మానంబుఁ గాపాడకొనుటకు నగ్గుపాలతో నేర్చుకొనినధర్మము. రజపుత్రస్త్రీ మానభంగముపొందెనను గాథ యింతవఱకు మా రాజపుత్రస్థాన చారిత్రము నందగుపడలేదు. భవిష్యత్తునందుఁగూడ నటులజరుగకుండఁ బరమేశ్వరుఁడనుగ్రహించుఁగాక.

సీ॥ ఘోరీతురుష్కుని ♦ గోలఁబెట్టించిన
రాణిసంయుక్త ♦ శౌర్యంబువలన

అల్లాయుద్దీనుని ♦ ఆడించివంపిన
పద్మినీదేవి దీ ♦ వనలవలన
అక్బరుపాదుషా ♦ నదలించివంపిన
రాణివీరాబాయి ♦ రక్తివలన
ఔరంగజేబు నీ ♦ రానట్లుజేసిన
సాధ్వీమాయిందిర ♦ శక్తివలన
రాజపుత్రాంగనలమాన ♦ రక్షణంబు
వారిచేతులలోన నం ♦ పదలఁబొదలి
ప్రతిభతోనేటివఱకు జీ ♦ వనముఁజేయు
శాశ్వత యశస్సుతోడనో ♦ సాహెబేంద్ర!

సీ॥ ప్రళయదంభోళి సం ♦ భవఘోరవహ్నుల
భయమది యరచేతఁ ♦ బట్టవచ్చు
దక్షిణాధిపుభుజా ♦ దండదండంబురు
దర్పించియరకాలఁ ♦ దన్నవచ్చు
ఫాలనేత్రునిచేతి ♦ శూలంబుపోటులఁ
బూజంతిస్వర్గగాఁ ♦ బొందవచ్చు
జామదగ్న్యునిచేత ♦ జలియించుపరశువు
నవలీలఁగొనగోర ♦ నదమవచ్చుఁ
గాని రసపుత్రిశుద్ధాంత ♦ కాంతపాద
వర్జితంబగుధూళిలో ♦ వంతునేని
దాకఁగల్గినవీరుఁడీ ♦ ధరణిలేడు
రాజపుత్రులశక్తి ని ♦ ర్మాణమిద్ది!

కాన నీఁకబుద్ధిఁదెచ్చుకొని యిట్టిఘోరకార్యములకొడిఁగట్టుకొనకుము॥

రహీ—రాజాసాహెబ్! మీహితంవుంది మాకీమంచిబుద్ధియిచ్చింది.భూనంవచ్చిందివుంది మాకిలెంకల్ తల్గీపించిపోతాయ్.

కేకి—సాహెబేంద్ర! మీ మస్తానువారికి మా సలాములనందజే యుము. విక్రమసింహా! వీరిని గుడారములవఱకు సాగనంపిరాఁ గొం దఱు చారులను పంపిరండు ?

విక్ర—చిత్తము.

(అని నిష్క్రమించును. రహిమత్ఖానుఁడును వానితో వెడలును.)

కేకి—చంద్రావతీ! ఏవీరపురుషుని సహాయముచే మనమీ విపదంబుధినుండి బయటఁబడఁ గల్గితిమో వానిని సత్కరింపవలయును గదా? ఏవిధమగు సత్కారముచే నీతనిఁ దృప్తిఁ బఱుపఁగలుగుదుమో నిర్ణయించు భారము నీపైనున్నది.

చంద్రా—(సర్దర్ఖా ముఖమువంకఁ జూచుచున్నయది)

సర్దా—(చిఱునవ్వునవ్వుచుఁ దలవంచుకొనును)

కేకి—దేవీ! నీయభిప్రాయము నేనెఱింగితిని. అటులఁ జేయుట నాకును సమ్మతమే.

(విక్రమసింహుఁడు ప్రవేశము)

కేకి—అమాత్యశేఖరా! ఖానుని సాగనంపితిరా?

విక్ర—ఆహా! సాగనంపియే వచ్చితిని.

కేకి—రండు కూర్చుండుఁడు. సుధీవరా! చిరకాలమునుండియు నీరాజస్థానమును వేకన్నులఁగని పెట్టుచు మహామంత్రులై వర్తించుచున్న తమయాజ్ఞ లేక నేవిషయమును నిర్ధరింప మాకు వీలు లేదుగదా? మన సర్దర్ఖా యీమహనీయుని పటమును జూచిననాటనుండియు వీనినే పరిణయంబాడ నిశ్చయించుకొనుటయు, గొలఁది కాలములోనే మనము సుముహూర్తమును నిశ్చయించి శుభలేఖ నంపవచ్చుఁగదాయని యనుకొనుటయు, నింతలోనే మనకీవిపద్దశ సంభవించి కాలంబంతయు వ్యథలతోడనే గడచిపోవుటయుఁ దామెఱిఁగియున్న విషయమే యగుటచే

నేనక్కడుఁగ వచింపనక్కఱయే లేదు. ఈశ్వరానుగ్రహమున వానిదర్శన
భాగ్యమును, దానికిఁదోడు వానిసహాయసంపత్తియు, మనకప్రయత్న
ముగానే దొరకిన యీసావకాశమును మనము చెడనాడుకొనుట భావ్య
ముగాదుగదా? మనసర్దార్బా నీమహనీయునికి ధర్మపత్నిగానొసర్పనిశ్చ
యించితిగాన మనపురోహితుల రావించి సుముహూర్తనిశ్చయముఁజే
యించి వివాహసన్నాహముల నన్నిఁటిని జేయింపుఁడు?

విక్రి—దేవా! తామొనర్చిన యేర్పాటువలన నాకుఁ జాలసంతో
షమైనది. సుముహూర్తనిశ్చయమున కేమున్నది. మనసర్దార్బాచేత
నీమహనీయుని గళసీమున నే యిప్పుడొక హారము వేయించినచో నెమ్మ
దిగా సుముహూర్తమును జరిపించవచ్చును.

కేకి—మంచిది. అమ్మా! సర్దార్బా!

ఉ॥ ఏమహనీయునిన్ మది వ ♦ రించివిరించి నిగోల్చియుంటివో
యేమహనీయుసాయమున ♦ నీవిపదంబుధి దాటియుంటివో
యేమహనీయు శౌర్యమున ♦ నీశులు చాలఁగ జెప్పకొందురో
యామహనీయుకంఠమున ♦ హారము వేయగదమ్మతల్లిరో॥

(అని హారమునుచేతికీయ)

సర్దా—(మెడలో వేసి దూరముగానిలువఁబడును. అందఱును
దమసంతోషమును వెలిఁబుచ్చుచున్నారలు)

కేకి—మంత్రిపుంగవా!

విక్రి—దేవీ? ఏమిసెలవు?

కేకి—సెలవిచ్చుట కేమున్నదిగాని. రాజ్యభారము చాలకాల
మువహించియుంటిని. అందుచే మదీయభుజస్కంధమున కిపుడుచాల
భారముగఁ దోఁచుచున్నయది, ఈభారమునుగూడ వదల్చుకొంటినేని
సుఖముగా నారమానాథుని గొల్చుకొనుచుఁ గాలక్షేపముఁ జేసికొం
దును. ఇదియే నాకోరిక.

విక్రి — దేవా! మనవంశమునకు నిల్చిన దీపము వీఁడేగదా? వానికిప్పుడు పదిసారమైదవయేఁడేగదా గడచుచున్నది. వాని భుజపీఠిపై నీరాజ్యలక్ష్మిని మోపిన నాతఁడేమి చేయఁగలఁడు?

కేకి — అవును. నాకావిచారముఁ గూడఁగలదు. చేతికక్కఱకు వచ్చినకుమారుఁడా విధంబుగ దిక్కులేని దుర్మరణంబందెను. ఇంకఁ బుత్రసంతానము లేదయ్యె. మనసర్వస్వ పరాధీనమైనదిగదా! కడిపెను విచారము ముందుపెట్టుకొని నేనేవిధి ప్రజాపాలనము నడుపఁగలను? వ్యాకులచిత్తముతోఁ రాజ్యభారము వహించియున్నచోఁ నేమియపాంతరములు వాటిల్లఁగలవో? ప్రజలకు ఏమిలోపములుగఁ గలుగునో? వారెంతగ గోలఁబెట్టుదురో, కన్నియను గట్టిపెట్టినంత మాత్రముచేతనే మనమీమహానీయునిఁ దృప్తిఁ బరచినవారమైతిమా, నారాజ్యమును రెండు భాగములుగ భాగించి యందర్ధభాగమును నీమహానీయునకుఁ గానుకగా నొసంగి మిగత యర్థరాజ్యమునకును యీపసి చిన్నిమనుమని రాజుఁగ జేసి వానికి యుక్తవయస్సువచ్చువఱకు నీమహానీయుఁడే ఆభారమును గూడఁ దమసహాయసంపత్తిచేఁ బరిపాలించునటుల నేర్పాటుఁజేసి నేను విశ్రాంతిఁ గైకొందును.

విక్రి — రాజేంద్రా! తమయాలోచనము బహుచక్కఁగానున్నయది. కాని నామనవి యొకటిగలదు. వయస్సునందమకంటెఁ బెద్దవాఁడనుగదా, తమతోఁబాటుగ నేనుగూడ విశ్రాంతిఁగైకొని యీస్థానము నన్నివిధములఁ దగినతీతిని యారితేఱిన నాకుమారునుంచి నేను కొంతకాలము దనుక బైఁ బెత్తనము వహించి యేలోపములు రాకుండఁ గనిపెట్టియుండెద నావిధంబుగ నుత్తరువులీయఁ బ్రార్థించుచున్నవాఁడ.

కేకి — మంత్రివర్యా! వింతయుక్తిఁ బన్నితిరి. పెద్దలగు తమకు నేనువ్యతిరేకముగఁ బలుకఁగలనా, అవశ్యమట్టులనేగానిండు. తమకుమారునికొలఁకేరినైనఁ బంపవేఁడెద,

విక్రి—చిత్తము (అని నిష్క్రమించి మరలఁ బ్రవేశము)

కేశి—నాయనా! వీరసింహా! అమ్మా! సర్దార్బా.

గీ. తల్లిదండ్రులులేని యీ ♦ తనయునెటులఁ
  బెంచెదరొ భారమంతయు ♦ మోసిమేన
  యల్లునల్లునిగాఁజేసి ♦ యాదరించి
  పెద్దలకుఁ గీర్తినిన్ దెచ్చి ♦ పెట్టవలయు॥

గీ. వంశమున కీతఁడొక్కఁడే ♦ బ్రతికియున్న
  వాఁడుమాతోడికష్టముల్ ♦ బడినవాఁడు
  కంటికిన్ రెప్పవోలెను ♦ గాచుకొంటి
  మెటులఁగాపాడెదరొ మీర, ♦ లికమీరు॥

(అని బాలకునిదగ్గఱకుఁదీసికొని వీరసింహునకు వప్పగించుచు) నాయనా! రాజసింహా!

ఆ॥ వె॥ ఇతఁడు మేనమామ ♦ యీమె నీమేనత్త!
  తల్లిదండ్రులింక ♦ తండ్రి! వీరె
  వీరియాజ్ఞ మీద ♦ పేరెన్నికనుగాంచు
  నటులవర్తిలంగ ♦ దయ్యుకుర్రి॥

(ప్రవేశము రణజిత్ సింహుఁడు)

రణ—రాజేంద్రా! వందనములు! తండ్రీనమస్కారములు—

కేశి—రణజిత్ సింహా! నీకుశుభంబగుఁగాక, రమ్ము కూర్చుండుము,

విక్రి—కుమారా! కూర్చుండుము,

కేకి— నేను నీతండ్రిగారును రయుక్తితీయుగనే యీసా మ్రాజ్యభారమునుండి విశ్రాంతిఁ గైకొనుచున్నారము. ఇఁకమీఁద నీపవిత్రానామాత్యపదవి నీభుజపీఠిపై మోపఁబడుచున్నయది. ఈసామ్రాజ్య భారమును నిప్పుడీ వీరసింహరాజసింహులపైఁ బెట్టుచున్నాఁడను. కాన నీతివిశారదుండవై వీరిపరిపాలనాసౌష్టవమునకుఁదోడునీడయ్యెదవుగాక, ఇందుకొఱకే నిన్ను రావించినది,

రణ— చిత్తము. దేవా!

గీ. విధికృతంబులందు ♦ వెనుఁదీయకుండఁగ
శక్తికొలఁది సేవ ♦ సలుపువాఁడ
వీరసింహునికీర్తి ♦ గౌరవములకును
దగినవన్నెఁదెచ్చి ♦ దనరువాఁడ।

కేకి— సెహబాస్ రణజిత్సింహా! సెహబాస్! వీరసింహా! కుర్రవానినిఁగూర్చి చెప్పవలసినదేమియూ చెప్పితిని. ఇదె నీకు వానినొప్పగించుచుంటిని. కాన సమస్తాధికారములనువహించియీధరాభారమును మోసెదవుగాక. (అని వీరసింహునినెత్తిపైఁ గిరీటముఁబెట్టి, మఱియు నీపరిపాలనమున !

సీ. రసపుత్రవంశ వి ♦ భ్రాజితంబగుకీర్తి
స్థిరముగ నభివృద్ధిఁ ♦ జెందుఁగాత
నిరతంబు సత్కార్య ♦ నియతిచేతనువన్నె
కులధర్మములకుఁ జే ♦ కూఱుఁగాత
మతభేదములను ♦ మాత్రంబునెంచని
యైకమత్యము ప్రజ ♦ కబ్బుఁగాత
దేశీయనాయకా ♦ దేశానువర్తులై
స్వేచ్ఛగాజనులు జీ ♦ వింత్రుగాత

గీ. సత్కులస్త్రీలు పతిభక్తి ♦ శరణుగాఁగ
స్థిరయశస్సును ధరకుఁ దె ♦ చ్ఛాదరుగాత
మద్యపానంబు దుర్వృత్తి ♦ మానిప్రజలు
దేశదారిద్ర్యపాశంబు ♦ దెంత్రుగాత।

విప్ర—తథాస్తు.

(అందఱు నిష్క్రమింతురు.)



